**UMA REAL GOLD SHEET COVERED JEWELLERY WILL ALWAYS BE ECONOMICAL**






*Yes, it is economical & durable for Several Years*

GENUINE GOLD SHEET COVERED UMA JEWELLERY MFRS & EXPORTERS




# UMA GOLD COVERING WORKS

H.O. UMA MAHAL ※ MASULIPATAM...

SALES DEPOTS :

| | | |
|---|---|---|
| 90, CHINA BAZAAR MADRAS-1 | 58I, SIVALAYAM St., VIJAYAWADA-1 | 104, AVENUE Rd., BANGALORE-2 |

Also at Hyderabad

# ఈ సంచికలో



ముఖచిత్రం : పార్వతి

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 12-00

దీపావళి ప్రత్యేక సంచికతో రు.17-00

యువ వడపళని మద్రాసు - 26.

ఈ నెల (మే) యువ ముఖ చిత్రం 'శ్రీరామ రక్ష' చాలా బాగుంది. ఏప్రిల్ సంచిక కోసం ఎదురుచూచి మా కళ్ళు నిరుత్సాహపడినవి. యద్దనపూడి సులోచనగారి 'మీనా' మా హృదయాలను ఆనందడోలికల్లో ముంచుతుంది. వనిర్మల ప్రభావతిగారి ''ఒకే ప్రశ్న రెండు జవాబులు'' చాలా సహజంగా వుంది.

పుష్పలత శోభనాచలపతిరావు, బందరు.

గౌరవనీయులైన సంపాదకులకు అభివందనములు.

'మే' యువ సంచికలోని కథలన్నీ బాగున్నాయి. వడ్డాది పాపయ్యగారి చిత్రాలు కనులకు విందు చేసినవి. ప్రముఖ రచయిత్రుల ''సీరియల్స్'' ఎంతో ఉత్సాహంగా సాగుతూ, తరువాత వచ్చే సంచిక కోసం ఇప్పటినుండే ఎదురు చూసేలా చేస్తున్నవి. శరత్‌బాబుగారి సంక్షిప్త నవల గురించి వేరే చెప్పనవసరంలేదు. వచ్చే సంచికలో ''దేవదాసు'' నవల ప్రచురిస్తారని తెలుసుకున్న నేను ఇప్పటినుంచే ఆ సంచిక కోసం ఎదురుచూస్తున్నాను.

శ్రీ గంభీర్, వెలుదర్తి గ్రామము,
జి॥ నల్లగొండ, ఆంధ్రప్రదేశ్.

# మీరు కష్టపడి సంపాదించుకొన్న సొమ్ముకు సరియైన విలువగల సైకిల్ కొనదలచుకున్నారా? హెర్క్యులిస్



ప్రతీపైసాకూడ మీరు కష్టపడి చమటలూడ్చి సంపాదించుకున్నారు. మీరు కూడబెట్టిన అమూల్యమైన సొమ్మును సరియైన విలువగల సైకిల్ మీద పెట్టాలి కదా?
హెర్క్యులిస్‌ను కొనండి. దానికి మీరు ఆశించే అన్ని లక్షణాలువున్నాయి — బలిష్టత, సాఫీగా పోవడము, ఖచ్చితము, వేగము, మన్నిక.
అది సహజమే.
హెర్క్యులిస్ — ఆగ్నేయ ఆశియాలో అన్ని సౌకర్యాలు గల పెద్ద ఫ్యాక్టరీలో నిర్మించబడింది కలకాలం మీ జీవితమంతా మీకు సేవజేస్తుంది. భారతదేశమంతటా 3,000,000 మంది హెర్క్యులిస్‌నే విశ్వసించేవారిలాగే మీరు హెర్క్యులిస్‌ను విశ్వసించవచ్చు.
హెర్క్యులిస్ ఒక్క సైకిలేకాదు - మీ జీవిత కాలపు నేస్తము.
భారతదేశములో తయారుచేయువారు: టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53.
ప్రొప్రైటర్లు: ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ అనుమతిని పొందినవారు.
* రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కు -
ది హెర్క్యులిస్ సైకిల్స్ & మోటార్ కో., లిమిటెడ్ యు. కె. వారిది.







TIC-H-5452

"చిన్న కుటుంబమే - సుఖవంతమైన కుటుంబం"

అత్యంత
సౌందర్యానికి
రమి ®
శాండల్ టాల్క్






మే నెల యువలో ప్రచురితమైన ఇచ్ఛాపురం రామచంద్రంగారి "యిది నిజంగా కథే" చాల చక్కగా వుంది. రచయితల, పత్రికాధిపతుల సాధకబాధ కాలను చక్కగా వివరించారు రచయిత ఏప్రిలు యువ వెలువడకపోవడంవల్ల చాల నిరాశచెందినా, ఈ నెల యువ చదవేక మమ్ములను అభినందించలేకుండా వుండ లేక పోతున్నాను. కారణం పవని నిర్మల ప్రభావతిగారి "ఒకే ప్రశ్న" కథ వ. పా. గారి చిత్రాలు

ఉషశ్రీ, నార్తురాజుపాలెం.

ఎడిటర్జీ ప్రణామ్.

మే నెల యువ సంచిక ఒక విధంగా మమ్మల్ని కొంచెం నిరుత్సాహ పర్చింది. కారణం అందులో రెండు కథలయొక్క ప్రింటు చాలా చిన్నది చేసేసేరు. దానివలన కథ ఎంత బాగున్నా చదవడానికి ఓపికలేకపోతున్నది. అంచేత మా యందు దయఉంచి యికనుండి ప్రింటు చిన్నదిగా కాకుండా యెప్పటి మాదిరే ప్రచురిస్తారని భావిస్తున్నాము.

యంగ్ మెన్స్ అసోసియేషన్ సభ్యులు.
కాన్పచహాల్ (ఒరిస్సా)

ఈ నెల "యువ" ("మే") చాలా ఆకర్షణీయంగా వుంది. "బిందుగా రబ్బాయి" శరత్ బాబుగారి సంక్షిప్త నవల ఆణిముత్యం. యిక "ఒకే ప్రశ్న...." "వుమెన్సు కాలేజీ", "ముందు చూపు" మరియు "ఇది నిజంగా కథే" చాలా బాగుగా, పాఠకుల హృదయాన్ని ఆకట్టుకునేలాగున్నాయి జె. నటరాజ్, పీలేరు.

# అంతు లేని ఆనందాన్ని పొందండి
# చూయింగ్ గమ్ చప్పరించి చూడండి!




కమ్మని పెప్పర్‌మింట్ రుచిగల
చిక్‌లెట్స్
చూయింగ్ గమ్




**60 పైసలకు 12** **10 పైసలకు 2**




అడమ్స్‌వారి
శ్రేష్ఠమైన తయారీ

WH-9760

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి **21**   జూన్, **1970**   సంచిక **6**


రాష్ట్రపతిగా శ్రీ వి. వి. గిరి ఎన్నికకు అభ్యంతరం చెపుతూ సుప్రీంకోర్టులో దాఖలు అయిన పిటిషనులను సుప్రీంకోర్టు కొట్టివేసింది. శ్రీ గిరి ఎన్నికను ఖాయపరిచింది. సుప్రీంకోర్టు నిర్ణయంవల్ల, శ్రీ గిరి ఎన్నిక చెల్లదని పిటిషనుదార్లు చెప్పిన అభ్యంతరాలలో ఏ ఒక్క దానిని కూడా సుప్రీంకోర్టు అంగీకరించలేదని స్పష్టమవుతున్నది.

శ్రీ గిరి రాజకీయ జీవితాన్ని గురించి తెలిసిన వారందరూ, సుప్రీంకోర్టు నిర్ణయంపట్ల ఎంతో సంతోషాన్ని పొందక మానరు. నిర్దుష్టమైన ప్రజాహిత జీవితాన్ని గడపిన మహావ్యక్తి, శ్రీ గిరి. యాభై సంవత్సరాల పూర్వం, కార్మికోద్యమంలో ప్రవేశించినప్పుడే శ్రీ గిరి తమ ఆశయాలతోపాటు ఆచరణీయ ధర్మాన్ని కూడా నిర్ణయించుకొన్నారు. అప్పటినుంచీ ఇప్పటివరకు ధర్మమార్గాన్నే అనుసరించారు. రాష్ట్రపతి ఎన్నికల విషయంలో శ్రీ గిరి ప్రవర్తనను కొంతమంది శంకించారంటే, దానికి కారణం కూడా శ్రీ గిరి నిజాయితీయే. ఎవరో చేసిన తప్పులకు శ్రీ గిరి బాధ్యులనే భ్రమ కొంతమందికి కలిగిందంటే, దానికి కారణం ఎన్నిక విధానంలోని లోపం తప్ప, శ్రీ గిరి ప్రవర్తనలో లోపం కాదు. శ్రీ గిరి ఎన్నికను ఖాయపరచిన సుప్రీంకోర్టు, పిటిషనుదార్లు చేసిన ఆరోపణలను తిరస్కరించిందన్న మాట. అంటే శ్రీ గిరి ధర్మప్రవర్తనలో లోపం లేదన్నమాట. ఈ మాట సుప్రీంకోర్టు తీర్పు ద్వారా కూడా ప్రకటితం కావడం చాలా సంతోషకరమైన విషయం.

*   *   *

ఆర్థికంగానూ, పారిశ్రామికంగానూ వెనుకబడివున్న ప్రాంతాలలో చిన్న తరహా పరిశ్రమలను ఎక్కువగా యేర్పాటుచేసే పక్షంలో భారత పారిశ్రామిక అభివృద్ధి బ్యాంకి సహాయాన్ని ఎక్కువగా ఉపయోగించుకోవడానికి అవకాశం ఇవ్వబడుతుందని కేంద్ర ప్రభుత్వ ఆర్థికశాఖ సహాయ మంత్రి పి. సి. సెథి, ఇటీవల రాజ్యసభలో ప్రకటించారు. ఈ ప్రకటన బాగానే వుంది. కాని, యీ విషయంలో ప్రభుత్వం చేస్తున్న కృషి ఏమిటి? చిన్న తరహా పరిశ్రమలు ప్రభుత్వ సహాయాన్ని ఎంతవరకు పొందగలిగాయి, అని జాగ్రత్తగా పరిశీలిస్తే, ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంతవరకు ఏ విధమైన అభివృద్ధి కనపడడంలేదు.

భారతదేశంలోని వెనుకబడిన రాష్ట్రాలలో ఒకటిగా ఆంధ్రప్రదేశ్‌ను కూడా పరిగణించడం ఇటీవలనే జరిగింది. ఈ పని ఎప్పుడో జరిగివుండవలసింది; ఇప్పటికైనా కేంద్ర ప్రభుత్వం వాస్తవిక పరిస్థితులను గమనించడం సంతోషకరమే. కాని, పరిస్థితులను గమనించి ప్రకటన చెయ్యడంతో కేంద్ర ప్రభుత్వపు బాధ్యత తీరిపోలేదు. వెనుకబడిన రాష్ట్రాన్ని, చాలా ముందుకు వచ్చిన రాష్ట్రాల దరిదాపులకైనా తీసుకొని రావడానికి తగిన కృషి వెంటనే జరగాలి. ఈ కృషి జరగడంలో యేమాత్రం ఆలస్యమైనా, ఆర్థికపరిస్థితుల హీనతవల్ల రాజకీయంగా దురదృష్ట పరిణామాలు ఏర్పడే ప్రమాదం వున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో నిరుద్యోగ సమస్య యీనాడు చాలా ఎక్కువగా వుంది. నిరుద్యోగతవల్ల భగ్నహృదయులైన యువకులు, రాజకీయంగా విపరీతమైన అలజడులలో పాల్గొంటున్నారు. ఆ అలజడులవల్ల తమ పరిస్థితులు బాగుపడతాయని వారు అనుకోవడం కేవలం భ్రమమాత్రమే కావచ్చును. కాని, అలాటి భ్రమలోపడిన యువకులకు, తమ కృషి ఫలవంతమైన మార్గంలో వున్నదనుకోవడానికి వీలుగా తగిన ఉద్యోగ సదుపాయాలు వున్నట్లయితే వారు తమ జీవితాలను ప్రయోజనకరమైన పద్ధతిలో నడుపుకోగలరు. అయితే, యువకులకు ఉద్యోగాలు ఎలా వస్తాయి? గవర్నమెంటు ఉద్యోగాలు, ఏటా యువకుల సంఖ్య పెరిగినట్లుగా పెరగవు. ఊహ, ఉత్సాహము, ఆశయము ఉన్న యువకులు, వేరే గతిలేకపోతేతప్ప గవర్నమెంటు ఆఫీసులలో గుమాస్తా ఉద్యోగాలకు ప్రాకులాడరు. ఇలాటి యువకులకు కావలసినది, వారి ప్రజ్ఞను పూర్తిగా ఉపయోగించి ముందుకు రావడానికి అవకాశాన్ని కలిగించే ఉద్యోగాలు. ఇలాటి ఉద్యోగాలు, పరిశ్రమలలో తప్ప ఉండవు. అందుచేతనే, పరిశ్రమలు బాగా ఏర్పడాలి. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ చాలా వెనుకబడి వుంది.

పెద్ద పెద్ద పరిశ్రమలను కొత్తగా స్థాపించే స్తోమతగల వ్యక్తులు యీనాడు ఎవరూ లేరు. కోట్ల రూపాయల పెట్టుబడితో పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించగల శక్తి యీనాడు కేవలం కేంద్ర ప్రభుత్వానికి మాత్రమే వుంది. కాని, అలాటి పరిశ్రమలను స్థాపించడంలో ప్రాంతీయ అవసరాలనుగాని, ఆ పరిశ్రమల స్థాపనకు కావలసిన సహజ సంపద లభించే అవకాశాలనుగాని పరిగణించకుండా, కేవలం రాజకీయ దృష్టిలో కేంద్ర ప్రభుత్వం పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించడం ఇన్నాళ్ళు జరిగింది. ఇకముందు కూడా, యీ పద్ధతి విరమింపబడుతుందనే సూచన ఇప్పటికీ ఏమీ కనబడటంలేదు.

ఆంధ్రప్రదేశ్‌లో పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించడానికి ఎన్నో అవకాశాలు ఉన్నాయి. మనం వాటిని వినియోగించుకోలేక పోతున్నాము. మాటవరసకి ముడి ఇనుము మన రాష్ట్రంలో పుష్కలంగా వుంది. ఈ ఖనిజం ఆధారంగా పెద్ద పరిశ్రమలనూ, చిన్న పరిశ్రమలనూ ఎన్నిటినో స్థాపించవచ్చును. కాని, కోట్ల టన్నుల ముడి ఇనుమును విదేశాలకు ఎగుమతి చేస్తున్నాము. పారిశ్రామికంగా అభివృద్ధికి రాదలచిన యే దేశమూ, ఉత్తరోత్తరా తన అవసరాలను గ్రహించినట్లయితే, ఆ దేశంలో లభించే ముడి సరకులను పరిమితి లేకుండా ఎగుమతి చెయ్యదు. కాని, మనం ఇప్పుడు చేస్తున్న పని ఇదే.

చిన్న తరహా పరిశ్రమలను అభివృద్ధికి తెచ్చుకోవడంలో పంజాబ్, మైసూరు, తమిళనాడు రాష్ట్రాలు చాలా ముందుకు వచ్చాయి. ఈ రాష్ట్రాలు అలా ముందుకు రావడానికి ముఖ్యమైన కారణాలు మూడు. ఒకటి, చిన్న పరిశ్రమలను స్థాపించడానికి ఉత్సాహంతో ముందుకు వచ్చిన వ్యక్తులు ఉండటము; రెండు, ఆ వ్యక్తులకు కావలసిన సదుపాయాలను అన్నిటినీ అమర్చడమేకాక, మంచి ప్రోత్సాహాన్ని ఆ రాష్ట్రాల ప్రభుత్వాలు ఇవ్వడము; మూడు, చిన్న చిన్న పరిశ్రమలు యేర్పడినప్పుడు వాటిని అనుబంధ పరిశ్రమలుగా ఉపయోగించుకొనగలిగిన, పెద్ద పరిశ్రమలు ఆ రాష్ట్రాలలో ముందుగానే ఏర్పడి వుండటము.

ఇలాటి పరిస్థితులే ఆంధ్రప్రదేశ్‌లో కూడా యేర్పడాలి. అయితే, చిన్న పరిశ్రమలను అనుబంధ పరిశ్రమలుగా ఉపయోగించుకోగల పెద్ద పరిశ్రమలు యేవీ యీనాడు ఆంధ్రప్రదేశ్‌లో లేవు; కేంద్ర ప్రభుత్వం ఇకమీదటనైనా నిష్పక్షపాతబుద్ధితో పెద్ద పరిశ్రమలను ఆంధ్రప్రదేశ్‌లో స్థాపించడానికి నిశ్చయించినా, అలాటి పరిశ్రమలు యేర్పడి, వాటిలో ఉత్పత్తి జరగడానికి చాలా ఏళ్ళు పడుతుంది. కాని, అంతవరకూ చిన్న పరిశ్రమలను సాపించడంలో అశ్రద్ధ జరుగ కూడదు. ఎక్కువకాలం, యీ విష

యంలో అశ్రద్ధ జరిగిందంటే రాష్ట్రంలోని సాంఘిక, రాజకీయ వ్యవస్థ దెబ్బతినే ప్రమాదం వుంది. చిన్న పరిశ్రమలు ఎక్కువగా స్థాపించడానికి ఎక్కువ వసతులూ, అవసరమూ కూడా గల ప్రాంతం, రాయలసీమ సర్కారు జిల్లాలలో శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు కూడా రాయలసీమలాగే, ఆర్థికంగా చాలా వెనుకబడి వుండటమేకాక, చిన్న పరిశ్రమల స్థాపనకు చాలా అనుకూలమైన వసతులు కలిగివున్నాయి. అయితే, యీ ప్రాంతాలను బాగుపరచాలంటే, చిన్న పరిశ్రమల స్థాపనతోపాటు, రాకపోకలకు, సరకుల రవాణాకు మంచి యేర్పాట్లు వుండాలి. ఈ విషయంలో కూడా, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు శ్రద్ధ వహించాలి.

పెట్టుబడి పెట్టడంలోగాని, సాంకేతిక నైపుణ్యాన్ని వినియోగించడంలోగాని సమర్థత గల వ్యక్తులు, చిన్న చిన్న పరిశ్రమలను స్థాపించడానికి, రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోనూ ముందుకు రావాలి. ఇలాటి వ్యక్తులకు కావలసిన అన్ని సదుపాయాలను ఇవ్వడానికి రాష్ట్ర ప్రభుత్వం ఏ విధమైన భేదబుద్ధి లేకుండా శీఘ్రంగా చర్య తీసుకోవాలి. అవసరమైనప్పుడు, కేంద్ర ప్రభుత్వ సహాయం కూడా వెంటనే లభించేటట్టు చెయ్యాలి. అలా అయితేనే, రాష్ట్రం బాగుపడుతుంది. ప్రజలు సుఖపడతారు

---

## రచయితలకు మనవి

ఈ యేడు కూడా యువ "దీపావళి" ప్రత్యేక సంచిక వెలువడుతుంది. దానికి రచయితలు తమ అమూల్యమైన రచనలు పంపి, సంచికను విజయవంతం చెయ్యాలని మనవి. మీరు పంపే రచనలపై "యువ దీపావళి ప్రత్యేక సంచికకు" అని రాయండి.

—సంపాదకుడు.

యువ

1, ఆర్కాట్ రోడ్,

మద్రాసు—26



వైశాఖమాసంలో ఒకనాటి మధ్యాహ్నాన ఎండ మహా తీక్షణంగా ఉన్నది. ఇక తాపం చెప్ప శక్యమేగాదు. సరిగ్గా ఇలాంటి సమయాన ముఖర్జీగారి అబ్బాయి దేవదాసు పాఠశాలలో ఒక మూలను చిరిగిన చాపపై కూర్చుని, కళ్ళు మూస్తూ, తెరుస్తూ, కాళ్లు చాపి, పలక క్రిందపెట్టి, ఆవలించి, చివరకు మహా ఆలోచనలో పడిపోయాడు. పడి, ఇలాంటి చక్కటి సమయాన గాలిపటం ఎగరవేసుకుంటూ పొలాలమీద తిరగటానికి బదులు పాఠశాలలో కట్టుపడి వుండటం ఏమాత్రం మంచిది కాదని స్థిరపరచు

కున్నాడు. ఉర్వర మస్తిష్కంలో చప్పున ఒక యుక్తి కూడ అంకురించింది. అతను పలక చేతపుచ్చుకుని లేచి నిలబడినాడు.

ఇప్పుడు మధ్యాహ్న భోజనానికి బడి వదిలిపెట్టారు. పాతకాలపు సత్రానికి సమీపంలోనే ఉన్న మర్రిచెట్టు క్రింద పిల్లలు గోలచేస్తూ దిబ్బగోడ్లు ఆడుతున్నారు. దేవదాసు ఒక మాటు అటు చూశాడు. మధ్యాహ్న భోజనానికి అతన్ని వదలిపెట్టరు. ఎందుకంటే, బడినుంచి బయటపడిన తర్వాత, మరల దానిలో ప్రవేశించడానికి దేవదాసు ఎంత మాత్రమూ ఇష్టపడడని గోవిందపండితుడు అనుభవపూర్వకంగా గ్రహించాడు. పైగా అతని తండ్రి కూడా వదలవద్దన్నాడు. ఈ కారణాలన్నింటివల్లా అతను, ఈ సమయంలో బడిపెద్ద 'భోలా' అవార్తీలో ఉండవలసి వచ్చింది.

పాఠశాలలో ఇప్పుడు పంతులుగారు ఒక్కరు మాత్రం మధ్యాహ్నపు బడలికచేత కళ్ళు మూసుకొని కునుకుతున్నారు. బడి పెద్ద భోలా ఒకమూలను వీపూ కాళ్ళూ విరిగిన బెంచిమీద చిన్నపంతులుగారి తీరుతో కూర్చొని, మధ్య మధ్య మహాసర్వజ్ఞత్వంగా ఒకమారు పిల్లలకేసి చూస్తూ మరోమారు దేవదాసు పార్వతుల మీద యాదృచ్ఛికంగా ఒకచూపు పారవేస్తూ ఉన్నాడు. పార్వతి రెండుమూడు మాసాల క్రిందటనే పంతులు గారి [illegible] వచ్చింది [illegible]. ఈ కొద్దికాలంలోనే పంతులుగారు ఆ పిల్ల మనస్సును రంజింపజేసి ఉండవచ్చును. [illegible] ధైర్యంతో [illegible] ఉన్న [illegible] గీస్తూ [illegible]ప్పుడు, ఒక చిత్ర[illegible] గీస్తూ ఉన్న [illegible]లో తన ఆశయాలెంత[illegible] చూస్తూ ఉన్నది. ఎప్పుడు [illegible] ఏమీ పొందలేదు. కాని అంతకే [illegible] ఆనందమూ, తృప్తీ, అనుభవిస్తూ ఉన్నది.

ఈ సమయంలోనే దేవదాసు పలకచేతపుచ్చుకొని లేచి నిలబడి, భోలాను ఉద్దేశించి బిగ్గరగా- 'లెక్క కుదరటంలేదు' అని అన్నాడు.

“ఏ లెఖ్ఖ?” అని భోలా శాంత గంభీరస్వరంతో అడిగాడు.

“మణుగు లెఖ్ఖ.”

“పలకేదీ?”

దీని అర్థం ప్రతివిషయానికీ పలక తనకు తెచ్చి చూపించమని. దేవదాసు పలక చేతికిచ్చి దాపునే నిలబడ్డాడు. భోలా బిగ్గరగా పైకి అంటూ వ్రాయ నారంభించాడు: “ఒక మణుగు నూనె ధర పద్దానుగురూపాయలా, తొమ్మిదణాలా, మూడు పైసలైతే—

ఈ సమయంలోనే ఒక ఘటన ఘటిల్లింది. కాళ్ళూ వీపూ విరిగిన ఈ బెంచీని



బడిపెద్ద భోలా తన పదవికి తగిన ఆసనంగా నిర్ణయించుకుని, నియమం తప్పకుండా ఇప్పటికి మూడు సంవత్సరాల నుంచీ కూర్చుంటూ వస్తున్నాడు. బెంచీకి వెనక ఒక పొడి సున్నపురాపి [illegible] దిద్ది ఎప్పుడో. [illegible] చాక ధరకు [illegible] అద్దెపెట్టారు [illegible] ఉంటే [illegible] వీరి ఉద్దేశము. [illegible] ఎప్పుడు [illegible] కూర్చుంటున్న వీరికి శ్రద్ధా, [illegible] విపరీతంగా ఉంది. [illegible] ప్రపంచ [illegible] విద్యార్థులు [illegible] ఒక్కరేనుప్పు [illegible] కుండా [illegible] యుప్పాటుడూ, [illegible] వయసులు [illegible] పెద్దా అయిన భోలానాధునికి—తాను మహాయత్నంతో కూడబెట్టిన [illegible]— జాగ్రత్తగా కనిపెట్టి ఉండేకారం వప్పగించాడు. అందుచేతనే భోలా ఆ బెంచీ మీద కూర్చుంటూ ఉండేవాడు.

భోలానాధుడు వ్రాస్తున్నాడు:— "ఒక మణుగు నూనెధర పద్ధానుబరూపాయలా, తొమ్మిదణాలా, మూడుపైసలైతే....అమ్మనాయనో" — తర్వాత పెద్ద గందరగోళం అయింది. పార్వతి బిగ్గరగా చీత్కారంచేసి, చప్పట్లు కొట్టుతూ నేలమీద పొర్ల నారంభించింది. నిద్రాభంగం కావడంచేత, గోవిందపండితుడు రక్త నేత్రాలతో చివుక్కుమని లేచి నిలుచున్నాడు. చెట్టుక్రింద వున్న పిల్లలు వరసగా నిలబడి 'ఛక్ ఛక్' మంటూ పరుగెత్తుతూ వీర్కి కంటపడ్డారు. అటునుంచి దృష్టి మరల్చి పాఠ

శాలలో చూశాడు—విరిగిపోయిన బెంచీమీద ఒకజోడు కాళ్ళు ఆడుతూ ఉన్నాయి, సున్నం మధ్యనుంచి అగ్నిపర్వతంలోంచి వచ్చినట్టుగా పొగ వస్తూ ఉన్నది.

"ఏంటి? ఏంటి? ఏంటిరా?" అని కేకపెట్టారు.

చెప్పటానికిక అక్కడ మిగిలిందల్లా పార్వతి. కాని, ఇంకా ఆ పిల్ల నేలమీద పొర్లుతూ చప్పట్లుకొట్టుతూ ఉన్నది. పంతులుగారి విఫలప్రశ్న, క్రుద్ధభావంతో 'ఏంటి? ఏంటి? ఏంటిరా?' అని తిరిగి వచ్చింది. తర్వాత శ్వేతమూర్తి భోలానాధుడు సున్నం పడనెట్టుకొని లేచి నిలబడ్డాడు. పంతులుగారు మరల చీత్కారం చేశారు : 'కోతి వెధవా! నువ్వేనా దాంట్లో?"

"ఊఁ- ఊఁ- ఊఁ-"

"మళ్ళీ?"

"దేవాయ్- పడేసి- ఊఁ-ఊఁ- మణుగుల్లెక్క-"

"పైగా పితుర్లా!"

కాని తర్వాత సంగతంతా గ్రహించి చాపమీద కూర్చుని- 'దేవాయ్ పడేసి పారి పోయాడా?' అని అడిగాడు.

"ఊఁ, ఊఁ, ఊఁ' అని భోలా పెద్ద పెట్టున ఏడ్చాడు.

తర్వాత కాసేపు సున్నం దులిపారు. కాని, తెలుపు పూర్తిగా పోకపోవడంచేత పిల్ల భోలా భూతం మాదిరిగా కనిపించ నారంభించాడు. అప్పటికీ వాడి ఏడుపు తగ్గలేదు.

"ఎటుంది దేవాయేనా పడేసి పారిపోయింది?" అని పంతులు మళ్ళీ అడిగాడు.

"ఊఁ—ఊఁ—"

"వాడి పని చెప్తాలే!"

"ఊఁ—ఊఁ—"

"మిగతా వెధవలేరీ?"

పిల్లలు కొందరు జేవురించిన ముఖాలతో రొప్పుకుంటూ వచ్చి దేవదాసు చిక్క లేదని చెప్పారు.

ఒకడు—"అబ్బా, రాయి ఎంత గురిగా—"

పంతులు—"చిక్కనే లేదా"?

ఇంకో చుర్రవాడు వెనకటివాడి మాటనే ప్రతిధ్వనింపబోయాడు :

'అబ్బా, రాయి—'

'నువ్వూరుకోరా వెధవా—'

వాడు మాటదిగమింగి పక్కకుపోయి నిలబడ్డాడు. నిప్పుల క్రోధంచేత మొదట పంతులు పార్వతిని బెదిరించాడు, తర్వాత, భోలానాథుని చేయిపట్టుకుని- 'పద, ఒకమాటు కచేరీ చావిడికి పోయి కనపడివద్దాము' అన్నాడు.

దీని అర్థం ఏమిటంటే, జమీందారు నారాయణముఖర్జీగారి దగ్గిరికి పోయి వారి కొడుకుమీద ఫిర్యాదు చేద్దామని.

అప్పుడు మూడు గంటలై ఉంటుంది. జమీందారు నారాయణ ముఖర్జీగారు పంచపాళిలో కూర్చుని హుక్కా తాగుతున్నారు. నౌకరొకడు విసనకర్రతో విసురుతున్నాడు. విద్యార్థులను వెంట పెట్టుకొని వేళకాని వేళను పంతులు రావటంచూసి నారాయణబాబు కొంచెం విస్మితుడై- 'గోవిందుడా!' అని అన్నాడు. గోవిందుడు కాయస్థుడు నేలకు వంగి నమస్కరించి, భోలాను చూపించి సంగతంతా సవిస్తరంగా వర్ణించాడు

ముఖర్జీగారు విరక్తుడై—'అదే, చూస్తే దేవాయ్ చెయ్యి మిగిలిపోయేటట్టుగా ఉన్నాడు!' అన్నాడు.

'ఏమి చేయమంటారో తమరే సెలవివ్వండి.'

నారాయణబాబు హుక్కాగొట్టం క్రిందపెట్టి 'వాడు ఎక్కడికి వెళ్ళాడు?' అని అడిగాడు

'నాకెలా తెలుసునండీ పట్టుకోబోయినవాళ్ళను రాళ్ళతో కొట్టాడట.'

కాసేపు ఇద్దరూ మాట్లాడలేదు. తర్వాత నారాయణబాబు 'ఇంటికి వెళ్ళు ఏదో వొకటి చేస్తాలే' అని చెప్పి పంతుల్ని పంపించాడు.

గోవింద పండితుడు క్రౌరవాసి నేలంపట్టుకుని పాఠశాలకు తిరిగివచ్చి కర్రతోనూ, ముఖంతోనూ, నానావిధ భావభంగిమలతోనూ, పిల్లకాయల నందరినీ భయపెట్టి- "దేవదాసు ఏనాడీ ఈ ప్రాంతానికి జమీందారయితే అయ్యాడు కాని, వాణ్ణిమాత్రం ఒక బళ్ళో అడుగుపెట్టనివ్వ" నని ప్రతిజ్ఞచేశాడు. ఆ రోజున బడి మామూలుకంటే కొంచెం ముందుగానే వదిలిపెట్టాడు. దోవను వెళ్ళేటప్పుడు కుర్రాళ్ళు ఈ విషయమే చర్చింప నారంభించారు.

ఒకడు.—అబ్బ! దేవాయి ఎంత పోగరుబోతురా!

ఇంకొకడు—భోలాకు బుద్ధి చెప్పాడురా!

మరొకడు—అబ్బ ఏం గురిరా!

వేరొకడు భోలాను సమర్థించాడు!—చూస్తారుగా, భోలా తప్పక వాడిపని పడతాడు.

"ఎందుకని చెప్పనే?"

"చెప్తే నన్ను కొడతాడు. నేనే ఏదన్నా తీసుకెళ్ళి ఇచ్చి వస్తాను."

ధర్మదాసుకు కొంతవరకు సంతృప్తి కలిగింది.

"అలాగే ఇవ్వు. కాని సాయంకాలం లోపల ఎలాగన్నా మైదుపుచ్చి ఇంటికి తీసుకురా."

"తీసుకొస్తానులే!"

పార్వతి ఇంటికి చేరుకోకముందే ఈ సంగతి ఆమె తల్లికీ దేవదాసు తల్లికీ తెలిసింది. వాళ్లు మళ్ళీ పార్వతిని అడిగారు. కాసేపు నవ్వుతూనూ, కాసేపు గంభీరంగానూ తనచేత పడినంతవరకూ వర్ణించింది. తర్వాత కొంగున మరమరాలు కట్టుకుని జమీందారుగారి మామిడితోపుకు బయలుదేరింది. తోట వీరింటికి దగ్గరే. దాంట్లో ఒకమూలను వెదురు గుబురు ఉన్నది. చాటుగా పొగాకు తాగటంకోసరం దేవదాసు అందులో కొంత చోటు బాగా శుభ్రంచేసుకు అడ్డు పెట్టుకున్నాడు. వాడు పారిపోయి నప్పుడు, అక్కడే దాక్కుంటాడని పార్వతికి తెలుసు. అందుచేత పార్వతి సరాసరి ఇక్కడికి వెళ్ళింది. దేవదాసు వెదురు పొదలో కూర్చుని పెద్దవాళ్ళమాదిరిగా ధూమపానం చేస్తున్నాడు. ముఖం [illegible] ఉన్నది— [illegible] దురాలోచనా [illegible] కూడా స్పష్టంగా కనిపిస్తున్నాయి. పార్వతిని చూడగానే వాడికి సంతోషం కలిగింది. కాని దానిని బయటకు కనబడనివ్వకుండా పొగ గుప్పున వదులుతూ—"ఇలారా" అని గంభీరంగా అన్నాడు.

పార్వతి దగ్గరకువచ్చి కూర్చున్నది. దేవదాసు దృష్టి ముందుగానే చెంగునఉన్న మూటమీద పడింది. ఒక్క మాట ప్రశ్నించకుండా మూట విప్పి తిన మొదలుపెట్టి— "పారూ! పంతులు ఏమన్నాడే?" అని అడిగాడు.

"పెదబాబుతో వచ్చి చెప్పాడు."

"నాన్నతో చెప్పాడా?" అన్నాడు దేవదాసు గుడ్లు పెద్దవిచేసి.

"ఆఁ"

"తర్వాత?"

"నిన్నిక బళ్ళోకి రానివ్వరట!"

"చదువు ఎవడు కోరుతున్నాడు!"

తినుబండారం పూర్తికావచ్చింది. దేవదాసు పార్వతి వంకచూసి—"మిఠాయిలే!" అన్నాడు.

"మిఠాయి తీసుకు రాలేదు."

"అయితే నీళ్ళివ్వు."

"నీళ్లక్కడ తెచ్చేది?"

"ఏమీ లేకుండా ఎందుకువచ్చావ్? పో, నీళ్లు తీసుకురా!" అన్నాడు విసుక్కుంటూ.

అతని కర్కశ స్వరం పార్వతికి బాగుండలేదు—"నేను మళ్ళీ పోలేను. నువ్వే తాగివద్దువుగాని రా" అన్నది.

"నే నిప్పుడు రాగలనా?"

"మరి ఇక్కడే ఉండి పోతావా?"

"ఇక్కడే ఉంటాను—ఆ తర్వాత ఎటో అటు వెళ్ళిపోతాను."

దేవదాసు శ్మశాన వైరాగ్యం చూపేవరకు పార్వతి కళ్ళల్లో నీరు తిరిగింది. అతని మాటలు ఈపిల్ల మనసును కలచివేశాయి "నేను కూడా వస్తాను, దేవదా!" అన్నది.

"ఎక్కడికి?—నా వెంటా?—అదెలా?"

పార్వతి తల తిప్పుతూ—"నేనూ వస్తాగా?" అన్నది.

"ఉహుం, రానక్కరలేదు, ముందు నువు నీళ్ళు తీసుకురా."

"నేనూ వస్తాగా!" అన్నది పార్వతి మళ్ళీ పూర్వం మాదిరిగానే.

"ముందు నీళ్లు తీసుకురా!"

"నేను పోను—నువ్వు పారిపోతావు."

"అబ్బే, పారిపోనుగా."

కాని పార్వతికి ఈ మాటమీద విశ్వాసం కుదరలేదు. అందుచేత అక్కడినుంచి కదలలేదు. "పో, చెప్తుంటే!" దేవదాస్ హుకుమిచ్చాడు.

"నేను పోలేను."

దేవదాసు కోపంతో, పార్వతి జుట్టు పట్టుకులాగి—"పో, చెప్తుంటే!" అని గద్దించాడు. పార్వతి మాట్లాడలేదు. తర్వాత వీపుమీద ఒక గుద్దు పడింది. "పోనా?"

"నేను చచ్చినా పోను" అన్నది పార్వతి ఏడుస్తూ.

దేవదాసు అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాడు. పార్వతి ఏడుస్తూ తిన్నగా దేవదాసు తండ్రి దగ్గరకువచ్చి నిలబడింది. ముఖర్జీగారికి పార్వతి అంటే చాలా ప్రేమ.

"పారూ! ఎందుకమ్మా ఏడుస్తున్నావు?" అని బుజ్జగిస్తూ అడిగాడు.

"దేవదాసు కొట్టాడు."

"ఏడీ వాడు?"

"ఆ వెదురు గుమ్మెలో కూర్చుని హుక్కా తాగుతున్నాడు"

అసలు పంతులుగారు వచ్చినప్పటినుంచే వారు ఉడికిపోతున్నారు. ఈ మాట వినగానే భగ్గుమన్నారు. "దేవాయి హుక్కాకూడా తాగుతున్నాడా?"



"ఆఁ. రోజూ తాగుతున్నాడు. హుక్కా ఆ వెదురు గుమ్మెలో దాచిపెట్టాడు—"

"ఇన్నాళ్ళనుంచీ ఎందుకు చెప్పలేదు?"

"కొడతాడని."

ఈమాట యధార్థం కాదు. వెల్లడిచేస్తే దేవదాసుచేత దెబ్బలు తినాల్సి వస్తుందనే భయం పార్వతికి ఎప్పుడూలేదు. దేవదాసుకే దెబ్బలు తగులుతాయని యిన్నాళ్ళనుంచీ దాచింది. ఇవ్వాళ ఆ ఉడుకుమీద వెళ్ళగక్కింది. ఆ పిల్లకు ప్రాయం కూడా ఎంత? —ఎనిమిదేళ్ళు సరిగ్గా నిండలేదు. ఇంకా కోపం చాలా ఎక్కువ. అలాగని ఆ పిల్లకు వివేచనాశక్తి లేదనడానికి వీల్లేదు. ఇంటికిపోయి పక్కమీద పండుకుని చాలాసేపు ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది. ఆ రాత్రి అన్నం కూడా తినలేదు.

* * *

మర్నాడు దేవదాసును బాగా కొట్టారు. ఆ పగలంతా గదిలో పెట్టి గడియవేశారు. వాళ్ళ అమ్మ చాలా ఏడ్చి గోలచేసినమీదట వాడిని వదలిపెట్టారు. మూడోనాడు తెల్లవారకముందే తప్పించుకుని పార్వతి యింటి కిటికీ దగ్గరకు వచ్చి నిలబడి—"పారూ!" అన్నాడు.

పార్వతి రెండో పిలుపుకు కిటికీ తెరిచి—"ఎవరు! దేవదా?" అన్నది.

"ఆఁ. నేను! దబ్బున రా." అని దేవదాసు చేయి ఊపాడు. ఇద్దరూ కలుసుకున్నాక-"నేను హుక్కా తాగుతానని ఎందుకు చెప్పావు?" అన్నాడు.

"నన్నెందుకు కొట్టావు నువ్వు?"

"నువ్వు నీళ్ళు తీసుకు రావటాని కెందుకు పోలేదు?"

పార్వతి మాట్లాడలేదు.

"నువ్వొక గొడ్డువు. ఇకెప్పుడూ యిలాంటివి చెప్పమాకు!" అన్నాడు దేవదాసు.

"చెప్పనులే!" అన్నది పార్వతి.

"ఐతేపద, గాలం కొట్టుకొద్దాం. ఇవ్వాళ చెరువులో చేపలుపట్టాలి."

వెదురుగుమ్మకు దగ్గరగానే గానుగుచెట్టు ఒకటి ఉన్నది. దేవదాసు అది యెక్కి-చాలా కష్టంతో వెదురుచువ్వ ఒకటి వొంచి పార్వతికి పట్టుకోమని యిచ్చి "జాగర్త. దాన్ని వదిలిపెట్టేవు? నేను క్రిందపడతాను" అన్నాడు. పార్వతి ప్రాణాలన్నీ బిగపట్టి ఆ కొమ్మ పట్టుకొన్నది. దేవదాసు అది పట్టుకుని గానుగకొమ్మమీద కాళ్ళుపెట్టి చువ్వ కోస్తూ ఉన్నాడు.

"ఇక బళ్ళోకిరావా, దేవదా?" అన్నది పార్వతి క్రిందనుంచి.

"ఊహుఁ."

"పెదబాబు నిన్ను పంపుతాడుగా?"

"నన్నే ఇక పోవద్దని చెప్పాడు—పంతులే యింటికి వస్తాడట!"

పార్వతి కొంచెం ఆలోచనలో పడింది.

"రేపటినుంచీ యీ ఎండాకాలమల్లా ప్రొద్దుటపూట బడి పెడతారట—నే నిక పోతాను." అన్నది పార్వతి కాసేపు ఉండి.

దేవదాసు పైనుండే "పల్లకాదు?" అని గుడ్లు ఉరిమాడు.

పార్వతి యీ సమయంలో కొంచెం పరధ్యానంగా ఉండి చేతిలో చువ్వ వదిలిపెట్టింది. చువ్వ పైకిపోవటమూ, దేవదాసు క్రిందపడటమూ ఒక్కమాటు జరిగాయి. ఎక్కువ ఎత్తు లేకపోవటంచేత దెబ్బలు తగలలేదు కాని ఒంటిమీద చాలాచోట్ల గీచుకుపోయింది. దేవదాసు మండిపడుతూ లేచి, ఎండుపుల్ల ఒకటి తీసుకొని, పార్వతి వీపు మీదా, చెంపలమీదా—అందిన చోటనల్లా యిష్టంవచ్చినట్టు—కొట్టి "పో, నా ఎదట నుంచి!" అని హూంకరించాడు.

మొదట పార్వతి చాలా సిగ్గుపడింది. కాని దెబ్బలు ఎక్కువ తగిలినకొద్దీ అభిమానంతోనూ, కోపంతోనూ ఆ పిల్ల కళ్ళు నిప్పులు కక్కినవి. ఏడుస్తూనే-"నేను పెదబాబు దగ్గరికి పోతున్నాగా!" అని బెదిరించింది.

"పో, ఇప్పుడే చెప్పుకో, పో." అని దేవదాసు ఇంకోదెబ్బ వేశాడు.

పార్వతి వెళ్ళిపోయింది. కొంతదూరంపోయాక దేవదాసు పిలిచాడు. కాని పార్వతి వినిపించుకోలేదు. ఇంకా త్వరగా వెళ్ళిపోసాగింది.



"ఓ పారూ! ఒక్కమాట వినిపోవే!" అని దేవదాసు మళ్ళీ కేకవేశాడు. పార్వతి జవాబివ్వలేదు. దేవదాసు విరక్తుడై కాసేపు ఏమేమో వాగి, "పోయిచావు!" అని మనస్సులో తిట్టుకున్నాడు. పార్వతి పోయాక ఒకటి రెండు చువ్వలు నరికాడు. కాని అతని మనస్సు మాత్రం ఏమీ బాగాలేదు.

పార్వతి ఏడుస్తూ ఇంటికి వచ్చేసింది. చెంపమీద దెబ్బలు నీలిరంగుకు వచ్చాయి. వాళ్ళనాయనమ్మ చూసి "అమ్మయ్యో! ఎవరే ఇలా కొట్టింది, పారూ?" అని అడిగింది.

"పంతులుగారు." అన్నది పార్వతి కళ్ళు తుడుచుకొంటూ.

నాయనమ్మ పిల్లను చంకన వేసుకొని—"పద, ఒకమాటు నారాయణ దగ్గరికి వెళ్ళివద్దాము—ఎలాంటి పంతులో, పీడు! ఆహా, పిల్ల ప్రాణాలు తీశాడే!" అన్నది.

పార్వతి, నాయనమ్మ మెడ వాటేసుకుని—"పద!" అన్నది.

పార్వతి నాయనమ్మ ముఖర్జీ దగ్గరికి వచ్చి పంతులుగారి పూర్వీకుల నందరినీ, వైనాలవారీగా ఎత్తి, వారికి పారలౌకిక అశుభం కోరింది. తర్వాత గోవిందుని నానా తిట్లు తిట్టి—"చూడు నారాయణా! నాడి పోగను! శూద్రాధైనా కూడా బ్రాహ్మణ పిల్లమీద చెయ్యివేశాడు ఎలా కొట్టాడో చూడు ఒకమాటు!" అని బుగ్గమీద దెబ్బలను మహా వ్యథతో పసనిది చూపించ నారంభించింది.

"ఎవరుకొట్టారు పాపా!" అని నారాయణబాబు ప్రశ్నించాడు.

పార్వతి మాట్లాడలేదు. అన్నది నాయనమ్మ "ఇంకేమను? మన గొడ్డుమోతు పంతులే!" అని చీత్కారం చేసింది.

"ఎందుకు కొట్టాడు?"

పార్వతి ఒక్క ముక్కకూడా మాట్లాడలేదు. ముఖర్జీగారు పార్వతి ఏదో తప్పుచేసి ఉంటుందని ఊహించారు. అయినా ఇలా కొట్టడం భావ్యం కాదని తన అభిప్రాయం వెల్లడి చేశారు. వారి మాట విని పార్వతి—"ఇక్కడ కూడా కొట్టాడు." అని చొక్కా ఎత్తి వీపు చూపించింది.

వీపుమీద దెబ్బలు ఇంకా స్పష్టంగానూ ఇంకా బలంగానూ ఉన్నాయి. అంచేత వారిద్దరికీ మహాకోపం వచ్చింది. ముఖర్జీగారు పంతులును పిలిపించి సంజాయిషీ తీసుకుంటానని చెప్పారు. ఇలాంటి పంతులు దగ్గరికి ఇక పిల్లను పంపడం కూడా మంచిది కాదని తీర్మానించారు. తీర్మానం తరువాత పార్వతి, నాయనమ్మ చంక ఎక్కి సంతోషంతో ఇంటికి వచ్చేసింది కాని ఇంటివద్ద తల్లి క్రాస్‌లో పడిపోయింది.

"ఎందుకు కొట్టాడో చెప్పు?"

"ఊరకనే కొట్టాడు" అన్నది పార్వతి.

"ఊరకనే కొడతాడా ఎక్కడన్నా?" అని తల్లి పార్వతి చెవి మెలేసింది.

పార్వతి నాయనమ్మ ఆ గదిముందుగా పోతూ ఇది చూచి ఆగి—'అదికాదే పిల్లా! తల్లివై ఉండి నువ్వు కొట్టుతున్నావు కాని ఊరక, ఇక ఆ ముండాకొడుకు చెయిచేసుకో లేడటే!" అన్నది.

"ఉత్త పుణ్యానికి ఎప్పుడూ కొట్టడు. ఇంత బుద్ధిగల అమ్మాయి—ఏమి చేసిందో, అందుకే దెబ్బలు తిన్నది."

"ఉహుఁ- దేవదా కూడా పోవటంలేదు."

"నువ్వు పోవటంలేదు సరే, దేవదాసు కూడా పోవటంలేదా?" అని అడిగింది నవ్వుతూ.

"ఉహుఁ. మే మెవ్వరం పోవటంలేదు."

"అయితే మంచిదే—పూ మనో బళ్ళోకి వెళ్ళింది."

మనోరమ మేనత్త కూర్చోమన్నది, కాని పార్వతి తిరిగివచ్చింది. దోవలో రసిక పాల్ దుకాణంవద్ద ముగ్గురు సాతాని స్త్రీలు ఊర్ధ్వపుండ్రాలు పెట్టుకొని కంజరి చేతపట్టి బిచ్చం అడుక్కుంటున్నారు. పార్వతి వాళ్ళని కేకవేసింది. 'ఓ అమ్మీ, మీకు పాటలు వచ్చా?"

అందులో ఒక సాతాని తిరిగి చూచి 'ఎందుకు రావు తల్లీ?' అన్నది.

"అయితే పాడండి."

అప్పుడు ముగ్గురూ తిరిగి చూశారు. అందులో ఒకతె- 'ఊరక పాడం తల్లీ, బిచ్చం వేయాలి. మీ ఇంటికి పోదాం పద విందువుగాని' అంది.

"కాదు, ఇక్కడే పాడండి."

"కాణీ ఇవ్వాలి, తల్లీ."

"కాణీ లేదు, రూపాయి ఉంది" అని పార్వతి కొంగున మూట చూపించింది. మూట చూసి వాళ్ళు దుకాణం వదలి కొంచెందూరం వచ్చి కూర్చున్నారు. కంజరి వాయిస్తూ ముగ్గురూ గొంతులు కలిపి పాడారు. ఏమిపాడారో, దానికి అర్థం ఏమిటో- పార్వతికి బొత్తిగా తెలియలేదు. తెలుసుకోవాలని ప్రయత్నించినా తెలుసుకోలేదు. అసలు మనస్సే అక్కడలేదు—దేవదాసు దగ్గరకు ఎప్పుడో పరుగెత్తింది.

పార్వతి కొంగున ఉన్న మూటవిప్పి మూడు రూపాయలు వాళ్ళ చేతిలో పెట్టింది. వాళ్ళు ముగ్గురూ విస్తుపోయి ఆ పిల్ల ముఖంవంక చూస్తూ ఉండిపోయారు.

"ఈ రూపాయలు ఎవరివి తల్లీ?" అని ఒకతె అడిగింది.

"దేవ దాదావి."

"నిన్ను కొట్టడా?"

పార్వతి కొంచెం ఆలోచించి—"కొట్టడు' అన్నది.

"నూరేళ్ళు బ్రతుకమ్మా!" అని ఒకతె ఆశీర్వదించింది.

పార్వతి నవ్వుతూ 'ముగ్గురికీ భాగాలు చక్కగా కుదిరాయి కదూ?" అంది.

"ఆఁ, కుదిరాయి" అని తల తిప్పి, తర్వాత- 'రాధాకృష్ణులు నిన్ను కాపాడుతారు తల్లీ!" అని ఆశీర్వదించారు. ఈ దానశీల దెబ్బలు తినకుండా ఉండాలని వాళ్ళ కోరిక. పార్వతి ఆవేళ పెందలాడే ఇంటికి తిరిగి వచ్చింది.

మర్నాడు ప్రొద్దున్నే దేవదాసు కనిపించాడు. వాడి చేతిలో దారపుకండె ఉన్నది. గాలిపటం లేదు. అదిప్పుడు కొనాలి.

"పారూ! రూపాయలు తే" అని పార్వతిని అడిగాడు.

పార్వతి ముఖాన నెత్తురుచుక్కలేదు. 'లేవు' అన్నది.

"ఏమయినై?"

"సొతాని స్త్రీల కిచ్చాను—పాటపాడితే."

"అన్నీ ఇచ్చావా?"

"అన్నీ ఎన్నీ? మూడేగా!"

"నీకు, దెయ్యమా? అన్నీ ఇవ్వవచ్చా?"

"బాగా వుంది. వాళ్ళు ముగ్గురుండిరి! మూడురూపాయలు ఇవ్వకపోతే వాళ్ళకి భాగమెలా కుదురుతుంది?"

దేవదాసు గంభీరంగా—"నే నయితే రెండురూపాయ లిచ్చేవాడిని" అని దారపు కండెతో నేలమీద లెఖ్ఖవేసి—"అలాగైతే వారికి ఒక్కొక్కరికి పదిఅణాల అర్ధణా అరకానీ వచ్చేది!" అన్నాడు.

పార్వతి కొంచెంసేపు ఆలోచించి—"వాళ్ళకు నీ మాదిరిగా మణుగు లెఖ్ఖలువచ్చా, పంచుకోటానికి?" అని అడిగింది.

దేవదాసు మణుగులెఖ్ఖలు కూడా నేర్చుకున్నాడు. పార్వతి ఈ మాట అతనికి ఆనందం కలిగించింది—"అది నిజమే" అన్నాడు.

పార్వతి దేవదాసు చేయిపట్టుకుని—"నన్ను కొడతా వనుకున్నాను, దేవదా!" అన్నది.

"ఎందుకు కొడతాను?" అన్నాడు దేవదాసు విస్మయంతో.

"సొతాన్లు చెప్పారుగా నువ్వు కొడతావని."

ఈమాట అతనికి మహా ఆనందం కలిగించింది. పార్వతి భుజాన భారంవేసి—"ఛా, తప్పుచేయకపోతే ఎందుకు కొడతాను!" అన్నాడు.

పార్వతి చేసిన ఈ పని తన పీనల్‌కోడ్‌లో ఏ సెక్షన్ క్రిందికీ రాదని బహుశా దేవదాసు భావించి ఉంటాడు. ఎందుకంటే మూడురూపాయలు కాబట్టే ముగ్గురూ చక్కగా పంచుకో గలిగారు. పాఠశాలలో మణుగులలెఖ్ఖలు కూడా నేర్చుకోనటువంటి సాతాని స్త్రీలకు మూడు రూపాయలకు బదులు రెండు రూపాయలివ్వటం, వారిని బాధించ టమే అని కూడా ఇతను ఎంచాడు.

తర్వాత దేవదాసు దారపుబంతి వెదురుగుమ్మెలో దాచివచ్చి పార్వతి చెయ్యిపట్టు కుని గాలిపటం కొంటానికి కోమటింటికి బయలుదేరాడు.

* * *

"సరే, అలాగే అనుకో. కాని, నేనుమాత్రం ఇంక దాన్ని బళ్ళోకి పోనివ్వను."

"ఇక రాత కూతలు నేర్చుకోదా?"

"ఎందుకమ్మీ అంత సతుకు? కాస్త ఉత్తరం గీకటం, రెండాకులు రామాయణం చదవటం వస్తే సరిపోయె. పారూ ఏమన్నా ప్లీడరు కాబోతున్నదా, జడ్జీపని చేయ బోతున్నదా?"

తల్లి ఇక మాట్లాడలేదు. ఆ రోజున దేవదాసు చాలా భయపడుతూనే ఇంటికి చేరాడు. పార్వతి తప్పక అంతా చెప్పి వుంటుందని అతని నమ్మకం. కాని ఇంట్లో ఆ లక్షణాలేవీ కనబడలేదు. పైగా ఇవ్వాళ పంతులు పార్వతిని చావ చితకకొట్టాడనీ, రేపటినుంచి ఇక బళ్ళోకి పోదనీ, తల్లిదగ్గర విని మహా సంతోషంతో ఆ పూట సరిగా అన్నంకూడా తినలేదు. ఎలాగో రెండు మెతుకులు ముక్కూ నోటా కుక్కుకుని పార్వతి దగ్గరికి రొప్పుకుంటూ పరుగెత్తుకొచ్చి—"పారూ, నువ్వింక బళ్ళోకి పోవటగా!" అన్నాడు.

"పోను."

"ఎందుకనీ?"

"పంతులుగారు కొట్టారని చెప్పాను."

దేవదాసు పకపక నవ్వుతూ పార్వతి వీపు చరచి, 'నీవంటి బుద్ధిమంతురాలు ఈ ప్రపంచంలో ఇక ఎక్కడా లేదని, యోగ్యతాపత్రం ఇచ్చాడు! తర్వాత విమ్మళంగా పార్వతి బుగ్గ మీద దెబ్బలు జాగర్తగా పరీక్షించి—'అబ్బా!' అని నిట్టూర్చాడు. పార్వతి అతనివంక చూసి మందహాసం చేస్తూ- 'ఏమిటీ?' అంది.

"దెబ్బలు బాగా తగిలాయి కాదూ, పారూ!"

"ఊఁ" అన్నది పార్వతి తల తిప్పుతూ.

"నువ్వలా ఎందుకు చేశావు? అందుకనే నాకు కోపంవచ్చి కొట్టాను."

పార్వతి కళ్ళల్లో నీరు తిరిగింది. ఏంచేశానని అడగాలనుకున్నది కాని, అడగలేక పోయింది. దేవదాసు పార్వతి తల నిమురుతూ- 'ఇక అలా చేయకు- ఏమంటావు?' అన్నాడు.

"చేయను" అన్నది పార్వతి తల తిప్పి.

దేవదాసు ఇంకోమాటు పార్వతి వీపు చరచి- 'శభాష్, ఇక నేను నిన్నెప్పుడూ కొట్టను!' అని బరవాసా యిచ్చాడు.

* * *

రోజులు గడచిపోతూ ఉన్నవి. ఈ బాలబాలికల ఇద్దరి ఆనందానికి హద్దులేదు; పగలంతా ఎండలో తిరగటం, సాయంత్రం వచ్చి దెబ్బలు తినటం; మళ్ళీ ఉదయాన్నే లేచిపోవటం, తిరిగి తిట్లు తినటం మామూలయిపోయింది. రాత్రి ఏమీ ఒడుదుడుకు లేకుండా, నిశ్చింతగా నిద్రపోయేవారు. మళ్ళీ తెల్లవారగానే ఊరిమీద పడి అల్లరి ఆగమూ చేస్తూ తిరిగేవారు. వీళ్ళకు ఇక స్నేహితులు కూడా ఎవ్వరూ లేరు- వాళ్ళ అవసరం కూడా లేదు వీళ్ళకి-ఊరంతా ఉపద్రవాలు చేస్తూ తిరగటానికి వీరిద్దరే చాలు.

ఆ నాడు వీళ్ళు ప్రొద్దుపొడిచినప్పుడు పోయి చెరువులో దిగి రెండు యామలవరకూ బయటికి రాలేదు. నీళ్ళన్నీ కెలికి, గుడ్డలన్నీ బురద కొట్టుకొని తాము పట్టిన పదిహేను బురదమట్టలూ యోగ్యతానుసారంగా భాగం వేసుకుని, ఎర్రటి కళ్ళతో ఇంటికి తిరిగి వచ్చారు. పార్వతిని, యథోచితంగా సత్కరించి గదిలో పెట్టి తలుపు బిగించింది తల్లి. దేవదాసు సంగతి సరిగా తెలియదు. ఎందుకంటే వా డిలాంటి సంగతులేవీ బయట పెట్టడు. పార్వతి గదిలో కూర్చుని ఏడుస్తూ ఉండగా—మధ్యాహ్నం రెండూ రెండున్నర గంటలకు దేవదాసు గది కిటికీ దగ్గరకువచ్చి—'పారూ, ఓ పారూ!' అని నెమ్మదిగా పిలిచాడు. పార్వతి బహుశా ఇది విని ఉంటుంది. కాని కోపంతో జవాబివ్వలేదు. ఇక సాయంకాలం దాకా దేవదాసు వీరింటి దగ్గర ఉన్న చంపావృక్షం మీదనే గడిపాడు. సాయంకాలం ధర్మదాసు చాలా బలవంతాన వాడిని చెట్టునుంచి క్రిందికి దించి ఇంటికి తీసుకుపోయాడు.

మరి ఆ మర్నాడు ఉదయాన్నుంచీ పార్వతి దేవదాసు కోసం ఆతురతతో ఎదురుచూస్తూనే ఉన్నది. కాని దేవదాసు రాలేదు. పొద్దున్నే తండ్రివెంట ప్రక్క గ్రామానికి వెళ్ళాడట. పార్వతికి ఏమీ తోచక ఇంటినుంచి బయలుదేరింది. నిన్న దేవదాసు చెరువులో దిగేటప్పుడు పార్వతి చేతికి మూడు రూపాయలు ఇచ్చాడు, జేబులోనుంచి పడిపోతవని. అవి ఇంకా కొంగునే ఉన్నవి. పార్వతి చెంగు తిప్పుకుంటూ తాను కాసేపు ఏకాకిగానే తిరిగింది. తోడెవ్వరూ దొరకలేదు. అప్పుడు బడి ఉదయం పెట్టుతున్నారు. పార్వతి పడమట బజారుకుపోయింది. మనోరమ ఇల్లు అక్కడనే. ఆ పిల్లకూడా బడిలోనే చదువుతూ ఉన్నది. వయస్సులో కొంచెం పెద్ద. పార్వతి సఖి. చాలా రోజులునుంచి ఒకరినొకరు చూసుకోలేదు.

"మనో, ఇంట్లో ఉన్నావా?" అని వాకిట్లోకిపోయి పిలిచింది.

మనోరమ మేనత్త బయటకు వచ్చి 'పారూ!" అని పలకరించింది.

"ఆఁ, నేనే! మనో ఎక్కడ అత్తయ్యా?"

"బళ్ళోకి పోయింది—నువ్వు పోవటంలేదా?"

ఈ విధంగా ఒక సంవత్సరం గడిచింది. ఇక గడవటం కష్టమైంది. దేవదాసు తల్లి పోరు నానాటికీ యెక్కువైంది. "చూడండి దేవాయి ఊరక గాలికి తిరిగి పాడవుతున్నాడు. వాడిని యిక చదివించడం లేదా?" అని భర్తను అడిగింది.

వారు కొంచెం ఆలోచించి—"దేవాయిని కలకత్తా పంపుతాను. నగేను యింట్లో ఉండి చదువుకుంటాడు" అన్నాడు. నగేనుడు దేవదాసుకు మేనమామ అవుతాడు.

ఈ సంగతి అందరికీ తెలిసింది. పార్వతి విని చాలా భయపడింది. దేవదాసు ఒంటరిగా కనపడగానే అతని చేతులు పట్టుకొని ఊగులాడుతూ "నువ్వు కలకత్తా పోతావటగా, దేవదా?" అని అడిగింది.

"ఎవరన్నారు?"

"పెదబాబు చెప్పాడు."

"ఛా—నేను పోను."

"మరి నిన్ను బలవంతంగా పంపితేనో?"

"బలవంతంగానా?"

దేవదాసు ఈ మాట అనేటప్పుడు పెట్టిన ముఖభంగిమను చూసి, ఈ ప్రపంచంలో ఎవ్వరూ అతనిచేత బలవంతాన ఏ పనీ చేయించలేరని పార్వతి స్పష్టంగా గ్రహించింది. పార్వతికి కావలసినది కూడా ఇదే. అందుకని మహా ఆనందంతో ఇంకోమాటు అతని చేతులు పట్టుకొని ఊగులాడుతూ, ముఖంవంక చూసి—"చూడు దేవదా, ఒకవేళ పోతావేమో!" అన్నది.

"ఎప్పటికీ పోను."

కాని ఈ ప్రతిజ్ఞ నిలువలేదు. తండ్రి అతన్ని తిట్టీ, భయపెట్టీ ఆఖరికి ధర్మదాసును తోడిచ్చి కలకత్తా పంపించాడు. వెళ్ళేరోజున దేవదాసు మనస్సు చాలా బాధపడింది. కొత్తచోటుకు పోతున్నాననే ఆనందంకానీ, కుతూహలంకానీ, అతని కేమాత్రం కలగలేదు. దేవదాసును వదలిపెట్టడం పార్వతి కెంతమాత్రం యిష్టంలేదు. ఏడ్చింది; గోలచేసింది; కాని ఆ పిల్లమాట ఎవరు వింటారు? మొదట అభిమానంచేత దేవదాసుతో మాట్లాడనే లేదు. కాని చివరకు, దేవదాసు పిలిచి—"పారూ! మళ్ళీ నేను త్వరలో వస్తాను. పంపకపోతే పారిపోయైనా వస్తాను" అని ధైర్యం చెప్పినప్పుడు పార్వతి అలకమాని, తన క్షుభితహృదయం విప్పి అనేక సంగతులు చెప్పింది.

పిమ్మట దేవదాసు, తల్లి ఆశీర్వాదంతోపాటు ఆఖరి కన్నీటిచుక్కకూడా శిరస్సున ధరించి—సూటుకేసు చేత పట్టుకుని గుర్రపుబండి ఎక్కి వెళ్ళిపోయాడు. పార్వతికి అప్పుడు చాలా వేదనకలిగింది. కళ్ళవెంట ఎంతో నీరు కార్చింది. అభిమానంతో



ఆమె హృదయం బ్రద్దలయిపోయింది. మొదట కొంతకాలం పార్వతి ఇలాగడిపింది.

తర్వాత ఒకనాటి ఉదయాన లేచి చూచేవరకు, ఆమెకు చేసే పనులేవీ కనిపించ లేదు. ఇంతకుపూర్వం బడి మానేసి నప్పటినుండి, ఉదయం నుంచీ సాయం కాలంవరకు, ఉత్త అల్లరీ ఆగంతోనే సరిపోయేది. అప్పుడు చేయాల్సిన పనులు చాలా ఉండేవి—సమయం చాలేదికాదు. ఇప్పుడు సమయం చాలా ఉన్నది—కాని ఎంత వెదకినా, చేసేపని కనిపించలేదు. ఒకరోజున ఉదయం లేవగానే ఉత్తరం రాయటానికి కూర్చునేది. పది గంటలయ్యేది. తల్లి విసుక్కుంటూ ఉండడం చూసి- "అయ్యో, దాన్ని రాసుకోనియ్యవే. పొద్దుటిపూట ఊరిమీద తిరిగేకంటే రాసుకోటం మంచిది కాదూ?" అని నాయనమ్మ సమర్థించేది. ఇక దేవదాసు దగ్గరనుంచి ఉత్తరం వచ్చిన రోజున పార్వతికి పండగ; గదిలో కూర్చుని ఆ రోజెల్లా ఆ ఉత్తరం చదివేది.

ఇలా రెండు మాసాలు గడిచాయి. ఉత్తరాలు రాయటం, రావటంకూడా క్రమంగా మందగించాయి. ఉత్సాహం కొంత తగ్గిపోయింది.

ఒకనాటి ఉదయం పార్వతి—"అమ్మా, నేను మళ్ళీ బళ్ళోకిపోతానే!' అని తల్లిని అడిగింది.

"అలాగే పో తల్లీ! నిన్ను నేను బళ్ళోకి ఎప్పుడు పోవద్దన్నాను?" అన్నది ఆమె.

ఆ రోజున మధ్యాహ్నం, చాలా రోజులక్రిందట మూలపారవేసిన పలకాపుస్తకాలు బయటకు తీసి, దాసీ చేయిపట్టుకొని, మళ్ళీ వెనకటిచోటుకే పోయి శాంతంగానూ, ధైర్యంగానూ కూర్చున్నది.

"పంతులుగారూ! మా పారూను కొట్టాగిట్టా మాకండి, దాని యిష్టంతో అది బళ్ళోకి వచ్చింది. ఇష్టమైతే చదువుకుంటుంది. లేకపోతే ఇంటికొస్తుంది" అన్నది దాసీది పంతులుగారితో.

"తథాస్తు!" అని పంతులు లోపల అనుకుని, పైకి- "అలాగేలే" అన్నాడు. పార్వతిని కూడా కలకత్తా ఎందుకు పంపలేదని ఒకమాటు అడగా లనుకున్నాడు. కాని తన మనసులో ఉద్దేశాన్ని బయట పెట్టలేకపోయాడు.

భోలా వెనకటి బెంచిమీదనే కూర్చుని ఉన్నాడు. అతన్ని చూడగానే పార్వతికి నవ్వు వచ్చే పర్యంతమైంది; కాని మరుక్షణానే ఆమె కళ్ళలో నీరు తిరిగింది, తర్వాత భోలా మీద చాలా కోపంకూడా వచ్చింది. దేవదాసు ఇల్లు వదలిపెట్టడానికి కారకుడు వీడేనని ఆమె అనుకున్నది.

ఇలా కొన్నిమాసాలు గడిచాయి.

కొంతకాలానికి దేవదాసు తిరిగి ఇంటికి వచ్చాడు. రావటమే తడవుగా పార్వతి దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు. అనేక సంగతులు మాట్లాడుకున్నారు, పార్వతికి చెప్ప వలసింది ఎక్కువేమీలేదు; ఉన్నా చెప్పలేకపోయింది. దేవదాసు అనేక సంగతులు చెప్పాడు-అన్నీ కలకత్తావే-కొన్నాళ్ళకు ఎండకాలపు సెలవులుకూడా అయిపోయాయి. దేవదాసు మళ్ళీ కలకత్తా వెళ్ళిపోయాడు. పార్వతి ఈమాటూ ఏడ్చింది. కాని మునుపుటంత గభీరత లేదు.

ఈ విధంగా నాలుగుసంవత్సరాలు గడిచాయి.

ఈ నాలుగు సంవత్సరాల్లో దేవదాసు స్వభావం చాలా మారిపోవటం చూసి పార్వతి చాటున అనేకసార్లు కళ్ళు తుడుచుకున్నది. ఇంతకు పూర్వం దేవదాసులో ఉండే పల్లెటూరుతన మంతా పట్టణవాసంతో తుడుచుకుపోయింది. పాలిష్ చేసిన బూట్లూ, మంచిచొక్కాలూ, సన్ననిధోవతులూ, చేతికర్రా, బంగారపు గడియారం గొలుసూ-వీటిలో ఏవి లేకపోయినా అతను బయటికి రావటానికి సిగ్గుపడేవాడు, ఇప్పుడు నదిఒడ్డుకు షికారు పోవటం అతనికి ఇష్టంలేదు. తుపాకి తీసుకుని వేటకు



పోవడంలోనే అతనికి ఆనందం. చిన్న చిన్న పక్కచేపలకు బదులు పెద్ద పెద్ద వాలుగలు పట్టాలని ప్రయత్నించేవాడు. ఇంతటితో ఆగినా ఫరవాలేదు. సాంఘిక-రాచకీయాలూ, క్రికెట్, ఫుట్ బాల్ మొదలగువాటిని గురించి చర్చిస్తూ ఉండేవాడు. అయ్యో! ఎక్కడి పార్వతి,ఇంకెక్కడి తాల్‌సోనాపుర గ్రామం? బాల్యస్మృతిలో చిక్కుకొని పోకుండా వున్న ఒకటి రెండు ఆనందదాయక విషయాలు అతనికి జ్ఞాపకం లేదంటానికి వీల్లేదు. కాని, వివిధ విషయాలమీద ఉన్న ఉత్సాహంలో అవి అతని హృదయంలో ఎక్కువసేపు నిలిచేవికావు.

మళ్ళీ సెలవులు పూర్తికావచ్చినవి. క్రిందటి సంవత్సరం ఇతను రాలేదు. మిత్రులతో కలసి దేశాటనకి వెళ్లాడు. ఈ మాటు తల్లిదండ్రులు పట్టిగా రమ్మని ఉత్తరం వ్రాశారు. అందుచేత ఇష్టంలేకపోయినా బెడ్‌చుట్టి స్వగ్రామం రావటానికి హౌరాస్టేషను చేరుకున్నాడు.

ఇంటికి వచ్చినరోజున అతని ఒంట్లో బాగుండలేదు. అందుచేత ఆవాళ బయటకు రాలేదు. మర్నాడు పార్వతి ఇంటికివచ్చి- "అత్తయ్యా" అని పిలిచాడు.

"రా, నాయనా! కూర్చో" అని పార్వతితల్లి ఆదరంతో ఆహ్వానించింది. ఆమెతో కాసేపు మాట్లాడిన తర్వాత- "పారూ ఎక్కడ అత్తయ్యా!" అని అడిగాడు.

"అదిగో! ఆ వెనకగదిలో ఉంది."

దేవదాసు అక్కడకు వెళ్ళాడు. పార్వతి సందెదీపం వెలగిస్తూ ఉన్నది.

"పారూ!" అని పిలిచాడు. పార్వతి మొదట చకితురాలయింది. తర్వాత నమస్కారంచేసి ఎడంగాపోయి నిలబడింది. "ఏం చేస్తున్నావు, పారూ?"

ఇదంత ముఖ్యప్రశ్నకాదు— అందుకని పార్వతి జవాబివ్వలేదు. అసలు దేవదాసంటే కాస్త సిగ్గుకూడా పడుతున్నది.

"ప్రొద్దుకూకింది, వెళ్ళొస్తాను. ఒంట్లోకూడా బాగాలేదు" అని దేవదాసు వెళ్లిపోయాడు.

* * *

పార్వతి ఇప్పుడు పదమూడో ఏట పాదంపెట్టిందని వాళ్ళ నాయనమ్మ చెప్పుతూ ఉన్నది. ఈ వయస్సులో ఆడపిల్లలకు శారీరక సౌందర్యం అకస్మాత్తుగా యెక్కడనుంచో ఊడిపడుతుంది. వాళ్ళ చిట్టి ఒక్కమాటే పెద్దదయిందని తల్లిదండ్రులు ఆశ్చర్యపోతారు. ఇక ఎవరిచేతిలో పెడదామా అని త్రొక్కిసలాడుతారు. చక్రవర్తిగారింట్లో కూడా కొన్నాళ్ళనుంచి ఈ విషయమే చర్చ జరుగుతూ ఉన్నది. అందరికంటే తల్లికి ఎక్కువగా ఆతురత ఉన్నది. మాటల సందర్భంలో మాటిమాటికి—"అబ్బే! పార్వతిని ఇక ఉంచటం భావ్యంకాదు" అని భర్తతో అంటూ ఉండేది. వాళ్ళంత భాగ్యవంతులు కాదు. ఐనా పిల్ల చక్కనిదనే ధైర్యం ఒకటి ఉన్నది. ప్రపంచంలో రూపానికి గనుక విలువ ఉంటే పార్వతిని గురించి వీరికి పనే ఉండదు. ఇంకో సంగతికూడా ఉన్నది—ఇది ఇక్కడే చెప్పడం మంచిది. ఇంతకు పూర్వం కుమార్తెల వివాహం చెయ్యటానికి చక్రవర్తుల కుటుంబం అంత తొట్రుపడేదికాదు. కొడుకుల వివాహానికి పడేది. కుమార్తెల వివాహానికి శుల్కం తీసుకునేవారు. కొడుకులవివాహానికి పణం ఇచ్చి పిల్లని ఇంటికి తెచ్చుకునేవాళ్లు. నీలకంఠుని తండ్రి కూడా కుమార్తెవివాహానికి శుల్కం తీసుకున్నాడు. నీలకంఠునికి ఈ ఆచారమంటే తగని ఏవగింపు. పార్వతిని అమ్మి డబ్బు సంపాయించటం అతనికేమాత్రం ఇష్టంలేదు. ఈ సంగతి పార్వతి తల్లికికూడా తెలుసును. అందుచేతనే కుమార్తెకు త్వరగా వివాహంచేయమని భర్తను ఒత్తిడిచేసేది. ఇప్పటివరకు పార్వతి తల్లి తన మనసులో ఒక దురాశకు చోటిచ్చింది. దేవదాసుతో ఏదోవిధంగా పెళ్ళి కావచ్చునని అనుకున్నది. ఈ ఆశ గగనకుసుమమని ఆమెకు తోచలేదు. పట్టుపట్టితే దేవదాసు తప్పక పెళ్ళిచేసుకుంటాడని ఆమె విశ్వాసం. బహుశా ఆ నమ్మకంతోనే, నీలకంఠుని తల్లి దేవదాసు తల్లి దగ్గర ఒకనాడు ఈ ప్రసంగం ఎత్తింది.

"చూడు అమ్మాయి! దేవదాసుకూ, మా పారూకూ ఎంత స్నేహమో! అలాంటి అన్యోన్యత నే నెక్కడా చూడలేదు."

"ఎందుకుండదు పెద్దమ్మా? వాళ్ళిద్దరూ ఒక్క కడుపునపుట్టిన బిడ్డల్లాగా చిన్నప్పటి నుంచీ పెరిగారు."

"అదేను, అమ్మాయీ- అందుకనే అనుకుంటూ ఉంటాను—వాళ్ళిద్దరికీ....ఇదిగో దేవదాసు కలకత్తా వెళ్ళినప్పుడు చూచావుగా, దానికి ఎనిమిదేళ్లకూడా నిండలేదు. ఆ వయస్సులోనే వాడికోసం తిండీతిప్పలు మాని కట్టెపుల్లలా గయింది. మనందరికీ తెలుసుగా—దేవదాసు దగ్గరనుంచి ఉత్తరంముక్క వస్తే దానికి పండుగలా ఉండేది!"

దేవదాసు తల్లి దీనిభావం గ్రహించింది. కొంచెం నవ్వించికూడా. ఈ నవ్వులో హేళన ఎంత వున్నదో తెలియదు, కాని వేదనమాత్రం చాలా వున్నది. ఈ సంగతు లన్నీ ఆమెకూ తెలుసు; పార్వతి మీద ప్రేమకూడా వున్నది. కాని వారి వంశము పిల్లలను అమ్ముకొనేది! పైగా పొరుగుపిల్ల. ఛీ, ఛీ.

"ఇప్పుడు పెళ్ళిచేయడానికి వారికి బొత్తిగా ఇష్టంలేదు, అమ్మా! అందులో చదువు కొంటూ ఉన్నాడు. మా పెద్దబ్బాయి ద్విజదాసు పెళ్ళి చిన్నప్పుడే చేయటంవల్ల వాడి చదువంతా నాశనమయిందని నన్నిప్పటికీ దెప్పుతూ ఉంటారు."

పార్వతి నాయనమ్మ నిరుత్సాహపడింది. అయినా అని చూచింది.

"అదంతా నాకూ తెలుసు అమ్మాయీ! నువ్వెరుగుదువుగా, పార్వతి కాస్త కాలుబారు పిల్ల—పైగా ఏపుగా పెరిగింది—అందుకనే, నారాయణ ఇష్టపడకపోతే—"

దేవదాసు తల్లి అడ్డువచ్చింది: "కాదు పెద్దమ్మా! నేనిక వారికి చెప్పలేను. ఇప్పుడు గనక దేవదాసు పెళ్ళి సంగతి ఎత్తితే, వారిక నా ముఖంకూడా చూడరు."

ఈ ప్రసంగం ఇంతటితోనే అణగిపోయింది. కాని ఆడవాళ్ళకడుపులో ఏదీ దాగదు. భర్త భోజనం చేస్తూఉండగా దేవదాసు తల్లి ఈ ప్రసంగం ఎత్తింది: "ఇవ్వాళ పారూ నాయనమ్మ దాని పెళ్ళిసంగతి తెచ్చింది."

"ఆఁ, పారూకు ఈడు వచ్చింది. త్వరగా పెళ్ళిచేయటమే మంచిది" అన్నాడు భర్త తలయెత్తి.

"అందుకనే, ఇవ్వాళ ఆ ప్రసంగం ఎత్తి దేవదాసుకు-"

"నువ్వేమన్నావు?" అన్నాడు భర్త ముఖం చిట్లించి.

"నే నింకేమంటాను! పిల్లలిద్దరికీ సావాసమని ఆ పిల్లను కోడలుగా తెచ్చు కుంటానా? అసలే పిల్లల్ని అమ్ముకునేవంశం, పైన పొరుగుకుటుంబం- ఛీ, ఛీ!"

భర్త సంతృప్తిపడ్డాడు: "అంతగాక! సాటివాళ్ళలో నవ్వించుకుంటామా? నువ్వు అసలు ఈమాటలేవీ చెవిని పెట్టబోకు" అన్నాడు.

"అబ్బే, నేను వింటానా? మీరుకూడా పొరబడకండి" అన్నది భార్య. పొడినవ్వు







నవ్వి. భర్త ముఖం గంభీరంగా పెట్టి-"అలాగైతే, ఈ జమీందారీ ఏనాడో పోయేది" అన్నాడు.

వారి జమీందారీ చిరస్థాయిగా ఉన్నా ఎవరికీ ఆక్షేపణలేదు. కాని, నేను పార్వతి దీన చరిత్ర మాత్రం చెప్పుతున్నాను.

ఈ సంగతి నీలకంఠుని చెవినిబడగానే తల్లినిపిలిచి- "నువ్వు వారితో యెందుకు చెప్పబోయావమ్మా?" అని తిరస్కారంగా అడిగాడు. తల్లి మాట్లాడలేదు.

"పిల్ల పెళ్ళిచేయటానికి మనకు కాళ్ళుపుచ్చుకు తిరగాల్సిన అవసరం లేదు- మనకాళ్ళే పుచ్చుకుంటారు. పైగా మన అమ్మాయి అనాకారీ కాదు. నేను యిప్పుడే చెప్పుతున్నాను. చూడు- ఒక్కవారంలో సంబంధం కుదుర్చుకువస్తాను। పెళ్ళికాదని దిగులెందుకు?" అని ప్రతిజ్ఞ చేశాడు.

కాని ఎవరికోసమైతే తండ్రి శబ్దిచేశాడో, ఆమె నెత్తిన పిడుగుపడింది। దేవదాసు మీద తనకు కొంచెం అధికారమున్నదని పార్వతి చిన్నప్పటినుంచీ నమ్మింది. ఈ అధికారం ఆమె కెవ్వరూ యిచ్చిందికాదు. ఆమెకు తెలియకుండానే ఆమె మనస్సు నెమ్మదిగా, నిశ్శబ్దంగా, దృఢంగా ప్రతిష్ఠించుకుంటూ వచ్చింది. దాని బాహ్య ఆకృతి

ఏమీ- ఇంతవరకు ఆమెకు కనపడకపోయినా యివ్వాళ ఆ ఆధికారం పోతున్నదని తెలియగానే ఆమె హృదయంలో భయంకరమైన తుపాను రేగింది.

దేవదాసు లెఖ్ఖ వేరు. అతడు చిన్నతనంలో పార్వతి మీద పూర్తి అధికారం సంపాదించాడు- చలాయించాడు కూడా. కలకత్తా వెళ్ళినతర్వాత చదువు-సంధ్యల్లోనూ, ఆట పాటల్లోనూ పడి పార్వతిని చాలాభాగం వదలివేశాడు. పార్వతి గ్రామ్యజీవితంలో రాత్రింబగళ్ళు తననే స్మరించుకొంటున్నదని అతనికి తెలియదు. ఇంతేకాదు, చిన్నప్పుడు ఎవరినైతే తనవారని పూర్తిగా నమ్మాడో, న్యాయా న్యాయ విచక్షణ లేకుండా యింతకాలం ఎవరిమీద తన అధికారమంతా చలాయించాడో, అట్టివారిని, యౌవనంలో అడుగుపెట్టగానే- ఇలా హఠాత్తుగా వదిలిపెట్టవలసి ఉంటుందని అతను ఊహించలేదు. అప్పుడు వివాహం సంగతి ఎవరు ఆలోచిస్తారు? ఆ బాల్యబంధనం వివాహం మినహా ఏవిధంగానూ స్థిరపడదని ఎవరికి తెలుసు?

అందుకనే, "దేవదాసుతో వివాహంజరగదు" అనేవార్త పార్వతి హృదయంలోని కోరికల్నీ, నమ్మకాల్నీ తోసివేయ నారంభించింది. దేవదాసు ఆమెకు ఒంటరిగా కనిపించలేదు. అతను తరుచుగా బయటకురావటం లేదు. ఉదయం చదువుకుంటూ ఉండేవాడు. మధ్యాహ్నం ఎండగా ఉంటుందని యిల్లు కదిలేవాడుకాదు. ఒక్క సాయంత్రంమాత్రం-అదీ ఇష్టమున్నరోజున-బయటకు వచ్చేవాడు. కోటూ పంట్లాం తొడుక్కుని, బూట్లువేసుకుని, కర్ర చేతపట్టి చక్రవర్తిగారి ఇంటి ముందుగానే షికారుకు వెళ్ళేవాడు. పార్వతి కిటికీదగ్గర నిలుచుని కళ్లుతుడుచుకుంటూ చూసేది. ఎన్నో సంగతులు జ్ఞాపకం వచ్చేవి. ఇద్దరం పెద్దవారం అయామని అనుకునేది. చాలాకాలం ప్రవాసంలో ఉండడంచేత ఇద్దరూ సిగ్గుపడేవారు. ఆ రోజున దేవదాసు సిగ్గుపడి సరిగ్గా మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఈ సంగతి పార్వతి గ్రహించకపోలేదు.

దేవదాసు కూడా ఇలానే భావించేవాడు. అప్పుడప్పుడు మాట్లాడా లనుకొనేవాడు. కాని ఇది చూట్టానికి బాగాఉంటుందా అని మళ్ళీ సందేహించేవాడు. ఇక్కడ కలకత్తాలో మాదిరి కోలాహలం లేదు; సినిమా(డ్రామాలు లేవు, ఆట పాటలులేవు- అందుకనే చిన్ననాటిసంగతులు జ్ఞాపకం వచ్చేవి. "ఒరే, అలాంటి పార్వతి యిలా అయిపోయిందా," అని అనుకునేవాడు. పార్వతికూడా "అప్పటి దేవదాసు ఇప్పుడు దేవదాసబాబుగా మారాడా?" అని అనుకునేది. దేవదాసు యిప్పుడు విశేషించి చక్రవర్తిగారింటికి వెళ్ళటం లేదు. ఎప్పుడన్నా ఒకరోజున షికారుకు వెళ్ళేటప్పుడు వారి వాకిటిదగ్గరకు వచ్చి—"ఏం చేస్తున్నారు, అత్తయ్యా?" అని పిలిచేవాడు.

"రా నాయనా! వచ్చికూర్చో" అని పార్వతి తల్లి ఆహ్వానించేది.







"ఇప్పుడు కాదులే అత్తయ్యా. కాస్త తిరిగొస్తాను" అని అనేవాడు అతను.

ఇలాంటప్పుడు పార్వతి ఒక్కొక్కరోజున వెనక యింట్లో ఉండేది. ఒక్కొక్క రోజున ఎదుటపడేది. దేవదాసు తల్లితో మాట్లాడుతూ ఉంటే పార్వతి చల్లగా అక్కడ నుంచి తప్పుకు వెళ్ళేది. రాత్రి దేవదాసు గదిలో దీపం వెలుగుతూ ఉండేది. ఎండా కాలం కాబట్టి కిటికీతలుపులు తెరచి ఉండేవి. పార్వతి చాలా ఓపికతో అటువైపే చూస్తూ ఉండేది—ఏమీ కనపడేదికాదు. పార్వతి మొదటినుంచి అభిమానిని. ఎంత బాధ అయినా సహించేది కాని ఇతరులకు తెలియనిచ్చేదికాదు. ఇతరులకు చెప్పితే మాత్రం లాభమేమిటి? సానుభూతి ఆమె సహించ లేదు ఇక తిరస్కారం—వేళా కోళం?— అంతకంటే చావే మంచిది.

క్రిందటి సంవత్సరమే మనోరమకు వివాహమయింది. ఇంకా అత్తవారింటికి పోలేదు. అందుచేత మధ్య మధ్య వస్తూ ఉండేది. పూర్వం సఖులిద్దరూ కలిసి నప్పుడు మాటల సందర్భంలో ఈ సంగతికూడా వస్తూఉండేవి. ఇప్పుడు కూడా వస్తూఉన్నవి. కాని పార్వతి ఇప్పుడందులో పాల్గొనటం లేదు. మెదలకుండానైనా ఊరుకునేది. లేక ప్రసంగమన్నా మార్చేది.

పార్వతి తండ్రి రాత్రే ఇంటికి తిరిగివచ్చాడు. ఇన్నాళ్ళనుంచీ ఆయన వరుణ్ణి వెతకటానికిపోయాడు - ఒక్కమాటే లగ్నంకూడా పెట్టుకొని వచ్చాడు. ఇరవై ఇరవై అయిదు క్రోసుల దూరములో వర్ధమాన జిల్లాలో ఉన్న హాదీపోతా గ్రామ జమీందారే వరుడు. స్థితి బాగా ఉంది. వయస్సు నలభై కిలోపే. గత వత్సరమే భార్యపోయింది. మళ్ళీ వివాహం చేసుకుంటున్నాడు. ఈ శుభవార్త ఇంట్లో అందరికీ




ఈ విధంగా ఒక మాసం గడిచింది. ఈ మధ్య ఒకమాటు చక్రవర్తి కుమార్తెను తీసుకుపోవడానికి వచ్చాడు. కాని పార్వతి పోవటానికి ఇష్టపడలేదు; "దారీ తెన్నూలేని సంసారం నాన్నా! ఇంకా కొన్నాళ్ళుండి వస్తాను" అన్నది తండ్రితో. తండ్రి ముఖం చాటు చేసుకుని నవ్వుకొని—"స్త్రీజాతే యిటువంటి" దని మనస్సులో అనుకున్నాడు. తండ్రి వెళ్ళిపోయిన తర్వాత పార్వతి మహేంద్రుని పిలిచి— "నాయనా! ఒకమాటు మన అమ్మాయిని తీసుకురా!" అన్నది.

మహేంద్రుడు తప్పించుకోవాలని చూశాడు. యశోద ఎంతమాత్రం రాదని అతనికీ తెలుసు: "నాన్న పోతే బాగుంటుం దనుకుంటాను" అని సంకోచిస్తూ అన్నాడు.

"ఛీ, అది బాగా ఉంటుందా? అంతకంటె మనిద్దరంపోయి తీసుకువద్దాము," అన్నది పార్వతి.

"మీరు వస్తారా?" అన్నాడు మహేంద్రుడు ఆశ్చర్యంతో.

"తప్పేముంది నాయనా! సిగ్గుపడవలసిన విషయం ఇందులో నాకేమీ కనపడటం లేదు. నేను వెళ్ళినందువల్ల యశోద వస్తే, దాని కోపం తగ్గిపోతే—రావటం నాకేమంత కష్టం!"

మర్నాడు మహేంద్రుడు ఒంటరిగానే యశోదను తీసుకురావటానికి పోయాడు. అక్కడ ఏమి కౌశలం చూపించాడో తెలియదు, కాని నాలుగోనాడు యశోదను వెంటపెట్టుకుని వచ్చాడు.

ఆ రోజున పార్వతి వొంటిమీద కొత్తవీ, చిత్రమైనవీ, విలువగలవీ, చాలా నగ లున్నవి. కొన్ని ఆనాడే భువనబాబు కలకత్తా నుంచి తెచ్చియిచ్చాడు. పార్వతి అవి పెట్టుకుని కూర్చున్నది. దోవను వచ్చేటప్పుడు, యశోద కోపంతోనూ, అభిమానం తోనూ అనేక మాటలు వల్లించుకుంటూ వచ్చింది. కాని పినతల్లిని చూడగానే ఆమె స్తంభీభూతురాలైంది. ఆమె అనాలని, ద్వేషంతో వల్లించుకుంటూ వచ్చిన మాటలన్నీ మరచిపోయి అస్ఫుటంగా—"ఈమేనా!" అని అన్నది.

పార్వతి యశోదను చేయిపట్టుకొని ఇంట్లోకి తీసుకుపోయింది. దగ్గర కూర్చో పెట్టుకుని విసనకర్రతో విసరుతూ—"ఏం తల్లీ! అమ్మ మీద కోపమా?" అని అడిగింది.

యశోద ముఖం సిగ్గుతో కందిపోయింది. పార్వతి అప్పుడు తన వొంటిమీది నగలను ఒక్కొక్కటే తీసి యశోదను అలంకరింప నారంభించింది. యశోద విస్మ యంతో "ఇదేమిటి?" అని అన్నది.

"ఏమీలేదు. ఇది మీ అమ్మ అభిలాష!"

నగలు పెట్టుకోవటం యశోదకు ఇష్టం లేకపోలేదు. అలంకారం పూర్తి అయినాక ఆమె పెదవులమీద చిరునవ్వుకూడా కనిపించింది. యశోదను అలంకరించి నిరాభర ణయై, పార్వతి—"అమ్మమీద కోపమా తల్లీ?" అని అడిగింది.

"ఉహుఁ. కోపమెందుకు—కోప మేముంది?"

"అంతకాక మరేముంది తల్లీ! ఇది మీ తండ్రిగారిల్లు. పెద్దయిల్లు....ఎంతోమంది దాసదాసీలు కావలసి ఉంటారు. నేనూ ఒక దాసీనేగా. ఛీ. దాసదాసీల మీద అలగటం బాగా ఉంటుందా తల్లీ!"

యశోద ఏళ్లకు పెద్దదయినా మాటల్లో ఇంకా చాలా చిన్నది. ఆమె కలవర పడింది. పార్వతి విసనకర్రతో విసరుతూ అన్నది:

"దరిద్రుల బిడ్డను, మీ దయవల్ల ఇక్కడ కొంచెం చోటు చిక్కింది. ఎంతమంది దీనులూ, అనాధులూ మిమ్మల్ని ఆశ్రయించి బ్రతకటంలేదు?—నేను కూడా వారిలో ఒకతెను, ఆశ్రితులను ..."

పార్వతి ఆమె రెండు చేతులూ పట్టుకున్నది.

"నా తప్పులన్నీ ఎంచబోకు తల్లీ!" అన్నది.

మరునాడు మహేంద్రుడు యశోదను చాటుకు పిలిచి...."ఏం, కోపం ఏమన్నా తగ్గిందా?" అని అడిగాడు.

యశోద చప్పున, అన్న కాళ్ళు పుచ్చుకొని...."అన్నా! కోపంలో....ఛీఛీ.... ఏమేమో వాగాను. చూడు, ఆవెక్కడా వెల్లడించకు!" అన్నది. మహేంద్రుడు నవ్వ నారంభించాడు.



''మారుతల్లి ఎక్కడన్నా ఇంత ప్రేమ చూపిస్తుందా, అన్నాయి!'' అని యశోద అడిగింది.

రెండు దినాలు గడిచినాక యశోద తండ్రి దగ్గిరికిపోయి....''ఇంకా రెండు మూడు మాసాల దాకా రానని వారికి ఉత్తరం రాయి నాన్నా!'' అన్నది.

''ఎందుకు తల్లీ?'' అన్నాడు భువనబాబు ఆశ్చర్యంతో.

యశోద సిగ్గుపడుతూ. మందహాసంచేసి—''నా వొంట్లో అంత బాగాలేదు. కొన్నాళ్ళు పిన్ని దగ్గర ఉంటాను'' అన్నది.

ఆనందంతో వృద్ధుని కళ్ళవెంట జలజల నీరు కారింది. సాయంత్రం పార్వతిని పిలిచి—''నువ్వు నా పరువు నిలిపావు? నూరేళ్ల బ్రతుకు—నూరేళ్ల బ్రతుకు!'' అని ఆశీర్వదించాడు.

''అదేమిటండీ—'' అన్నది పార్వతి.

''అదేమిటో నే నిప్పుడు సరిగా చెప్పలేను—భగవంతుడా! ఇప్పుడు నువ్వు నన్నెంత అవమానంనుంచీ, మనోదుఃఖంనుంచీ తప్పించావు?''

ఆ సందె చీకటిలో భర్త కళ్ళలో నీరు నిండటం పార్వతికి కనిపించలేదు. ఇక వినోదలాల్, భువనబాబు చిన్నకొడుకు మిగిలాడు. వాడు పరీక్షకు కూర్చుని వచ్చి నాక మళ్ళీ చదవటానికి పోలేదు.

(ముగింపు వచ్చే సంచికలో)



# జాలి

శ్రీరంగం శ్రీనివాసరావు

"ఎలాగైనా నీకు జాలి ఎక్కువోయ్" అంటూంటాడు నా మిత్రుడు రామ్మూర్తి.

"మా ఆయనకి ఊళ్ళోవాళ్ళందరిమీదా కలిగే జాలిలో వెయ్యోవంతైనా నామీద కలగదు" అని కోపం వచ్చినప్పుడు మా ఆవిడ అవతలి వాళ్ళదగ్గర నా గురించి సాధిస్తూ అనే మాటలు.

"వాడిదంతా వాళ్ళ నాన్న పోలికే. ఆయనా ఇలాగే జాలి ఎక్కువైపోయి ఆస్తంతా దానధర్మాలకి తగలెట్టుకున్నాడు" అని, తండ్రి తాగుబోతూ, వ్యభిచారీ అయినపుడు కొడుక్కికూడా అవే అలవాట్లు సంక్రమిస్తే ఎలా అంటారో అచ్చు అలాగే అనేవాడు మామయ్య.

"ఆఁ పోదూ. అదొక రకం 'షో' అంతే" అని నా తోటివాళ్ళు నేను లేని సమయాల్లో అనుకుంటూ ఉండడంకూడా నే నెరుగుదును.

మొత్తం మీద వీటన్నిటివల్లాకూడా మామూలుగా మనిషన్నవాడికి ఉండాల్సిన జాలికన్నా నాలో అది చాలామట్టుకు ఎక్కువగానే ఉందన్న విషయాన్ని మాత్రం యావత్తుమందీకూడా నిస్సందేహంగా తేల్చేశారు. ఒక్క నేను తప్ప.

నా అభిప్రాయం మటుకు అందుకు పూర్తిగా వ్యతిరేకం. ఎందుకంటే మనం ఉన్న స్థితికన్నా తక్కువ స్థితిలో ఉన్న వాడికి ఏదైనా సాయంచెయ్యడం జాలి అని నేననను. అది మనిషి తాలూకు కనీస ధర్మం. అదీకాక ఒక చదువుకునే బీదకుర్రాడికి రెండ్రూపాయ లిస్తేనూ, రోడ్డుప్రక్క ముష్టివాడికో అయిదుపైసలు వేస్తేనూ అది జాలి అనిపించుకుంటుం దేమో నాకు తెలియదు. కాని నేనుమాత్రం అవేమీకూడా జాలి అన్న ఉద్దేశంతో చెయ్యలేదు. అసలా మాటకొస్తే వాళ్ళని చూసినప్పుడు కలిగే భయంవల్లమాత్రమే చేసేవాడిని.

దిక్కులేని వాళ్ళని చూసినప్పుడల్లా నాకు వెంటనే నేనే ఆ పరిస్థితిలో ఉంటేనో అనిపించి చెప్పలేని భయం వేస్తుంది. అంతేకాక అటువంటప్పుడు నాకెలా అని పిస్తుంది అనికూడా అనుకుంటూ ఉంటాను. అయితే వాళ్ళా పరిస్థితిలో నేనీ రకంగానూ పుట్టడం ఎలా జరిగిందో నాకు తెలియని సంగతుల్లో వొకటి. బహుశా అందరూ అనుకునేటట్లే భగవంతు డనేవా డొకడుండి, వాడే ఇలా పుట్టించాడేమో? కాని భగవంతుడే చేసిన అట్నుంచిటు మార్చి చేసుంటే నేనలాగే ఉండాల్సిందేమో అని తలుచుకొని భయ పడుతూ ఉంటాను.

అంచేత నేను చేసే చిన్నచిన్న దానా లన్నీ జాలివల్లే చేసినవి కావని వొప్పు కోవాలి. నేనుండకుండా అటువంటి దరిద్రపు స్థితిలో ఇంకొక రున్నందుకు, తద్వారా నన్ను దాన్నుంచి కాపాడి నందుకూ వాళ్ళకి నే నిచ్చే ఒకరకమైన లంచం అది.

* *

దేశం కాని దేశంలో ఉన్న ఆ మహా నగరానికి నేను వెళ్ళడం చాలా అనుకో కుండా తటస్థించింది. నేను చేసే వ్యాపా రానికి సంబంధించిన వో ముఖ్యమైన వ్యక్తి ఆ దిక్కుమాలిన చోట ఉండటం వల్ల నా కా ప్రయాణం తప్పలేదు.

చిన్నతనంలో ఎప్పుడైనా సరే మా నాన్నగారు ఎంత ఆయన ఆఫీసుపనిమీద వెళ్తున్నప్పటికీ ప్రయాణం అంటే చాలు ఆయన వెనకే నేనూ తోకలాగ తయా రయ్యేవాడని. అయితే చిన్నతనంలో సరదాగా అనిపించేది ప్రయాణం అంటే. కాని అది చిన్నతనంతోనే పోయింది.

ఇప్పుడు ప్రయాణం అనగానే అదొక రకమైన వికారం పుట్టుకొస్తుంది. ఎందు కంటే శుభ్రంగా యింటిపట్టున వేళకింత తిని కూర్చోకుండా, అనవసరంగా డబ్బు దండుగ, నిద్రదండుగ, అనారోగ్యం




తప్ప వాటిలో ఇంకేం లేదనిపిస్తుంది.

అయితే తప్పనిసరి గావడంవల్ల రెండ్రోజులపాటు రైల్లో చచ్చీ చెడి ప్రయాణంచేసి ఆ పట్టణం చేరుకొని ఒక చిన్న హోటల్లో దిగేను. అదృష్టం బావుండడం వల్ల ఆ రోజు సాయంత్రానికల్లా నా పని పూర్తయిపోయింది. తిరిగి అర్ధరాత్రి బండిలోనే తిరుగుప్రయాణం పెట్టుకున్నాను.

సాయంత్రం స్నానంచేసిం తర్వాత ఏంచెయ్యాలో తెలీక సరే ఊరు చూద్దాం వనుకున్నాను. కాని ఊరంతా చూడాలంటే చాలారోజులు పడుతుందని ముందే తెలిసిపోయింది. దాంతో హోటలికి దగ్గరగా ఉన్న బజార్లో మాత్రమే తిరగడం మొదలుపెట్టాను. దానివల్ల యింకొక సదుపాయంకూడా ఉంది. అదేవిటంటే, ఎటో పడి పోయినామంటే తిరిగి రావడానికి తోవతెలీక నానా అవస్థా పడాలి. ఈ లోపల రైలు కాస్తా దాటిపోవచ్చు. అందువల్ల దగ్గర బజారే నయమనిపించింది.

పేవ్‌మెంటు మీద నడుస్తూ ప్రక్కనున్న షాపుల్ని, వాటిలో మనుషుల్ని,

నన్ను తోసుకుంటూ పోతున్న జనాన్ని చూస్తే ఆశ్చర్యం వేసింది. ఇంతమంది ఏం పనులు చేస్తూంటారో తెలీక. కాని వాళ్ళు మాటాడుకొనే భాష నాకు పూర్తిగా రాకుండా పోకపోయినా బాగామాత్రం రాదు. అందువల్ల ప్రొద్దుటినుంచీ ఎవడితో మాట్లాడదావన్నా తడుముకోవాల్సొస్తోంది. అసలు ప్రపంచంలో యిన్ని వందల భాష లున్నందుకు కోపంకూడా వచ్చింది.

నేనిలా నానా రకాలుగా అనుకుంటూండగా "సాబ్, సాబ్" అన్నమాటలు నన్నుగురించే నన్న ఆలోచన రావడంతో ఆ మాటలన్న పెద్దమనిషికోసం చూశాను. అయితే అతను పెద్దమనిషి కాకపోవడమే కాకుండా కనీసం పెద్దవాడుకూడా కాదు. అతనో పది, పన్నెండేళ్ళ కుర్రవాడు. అతని జుట్టు చిన్న మూకుడు బోర్లించినట్లుగా ఉంది. అతని లాల్చీ అతని కొలతకి కుట్టింది కాదన్న సంగతి గుడ్డివాడికైనా (తడుముతే) తెలిసేలా ఉంది. దానికుండాల్సిన గుండీల్లో అన్నీ వూడిపోయి ఒక్కటిమాత్రం ఇంకా నిలబడి దాని రెండు చివరల్ని కలిపి ఉంచింది. అయితే లాల్చీ రంగుమాత్రం చెప్పుకోవడం కష్టం. దానికో జేబు సగం ఊడి మిగతా సగంవల్ల యింకా వేలాడుతోంది. ఆ లాల్చీ క్రింద ఒక అంగుళం మాత్రం పైకి కనిపించి మిగతా బాగం లాల్చీ క్రింద దాక్కున్న పొట్టి నిక్కరుంది.

ఆ కుర్రాడి మొహంలో ఆత్రుత కనిపించింది. నేను వెంటనే "ఏమిట"ని అడిగేను. వాడు వెంటనే గబగబా మాట్లాడ్డం మొదలుపెట్టాడు. దాని సారాంశం వాడు నా బూట్లకి పాలిష్ చేస్తానన్నది. కాని నేనా రాత్రికే పోవాలి కాబట్టి, ఎలాగా మళ్ళీ వాటినిండా దుమ్ము తప్పదు. అంచేత పాలిష్ అనవసరం అని వద్దన్నాను.

వాడు వెంటనే వెళ్ళిపోలేదు. బతిమాలడం మొదలుపెట్టాడు. నేనే అపూట బేరం అన్నాడు. ప్రొద్దుటినుంచీ తిండి లేదన్నాడు. పాలిష్ బ్రహ్మాండంగా చేస్తానన్నాడు. కేవలం 'చారానా' చాలన్నాడు. నాలాంటి వాళ్ళే కాదంటే వాడి గతేవిటన్నాడు. పాలిష్ నచ్చితేనే డబ్బిమ్మన్నాడు. లేకపోతే ఇంకేదో చెయ్యమన్నాడు.

వాడిని చూస్తూవుంటే నాకు 'అయ్యో' అనిపించింది.

"సరే" అని వాడిచేత పాలిష్ చేయించుకోవడానికి ఒప్పుకున్నాను. సంతోషంతో వాడు గబగబా పేవ్‌మెంటు మీద వో మూలగాఉన్న తన సామాను వేపు దారితీశాడు. నేనూ అటు వెళ్ళాను. నా బూట్లు విప్పి వాడిముం దుంచాను. వాడు వాటిని శుభ్రంగా తుడుస్తూ మళ్ళీ మాటలు మొదలుపెట్టాడు.

దీనికి మామూలు పాలిష్ అయితే అంత అందంగా ఉండదుట. ఇటువంటి వాటికి వాడే కలర్ పాలిష్ తనదగ్గ రుందిట. అది వేస్తే మళ్ళీ చాలాకాలం దాకా బూట్లగురించి ఆలోచించే పని లేదుట. వాటిల్లో మొహం చూసుకో వచ్చుట. అందువల్ల అది వేయించుకో మన్నాడు. పెద్ద ఖరీదు కాదని హామీ యిచ్చాడు.

దాంతో నాకు వాడంటే కొంచెం సరదా వేసింది. పోన్లే అనుకొని వాడితో సరే అదే కానిమ్మన్నాను. వాడికి ఉత్సాహం పెరిగింది. మళ్ళీ బూట్లతో కుస్తీ ప్రారంభించి మళ్ళీ ఆరంభించాడు.

ఈ ప్రకారం బూట్లు వాడితే వాటి అడుగునున్న సోల్ తొందరగా అరిగి పోతుందన్నాడు. తరువాత రీ సోలింగ్ చేయించినా లాభం లేదన్నాడు. పైతోలు దెబ్బ తినేస్తుందన్నాడు. అందువల్ల తిరిగీ కొత్తజోళ్లు కొనుక్కోవాల్సి వస్తుందన్నాడు. ఇప్పుడు బూట్ల ధరలు చాలా ఎక్కువగా ఉన్నాయన్నాడు. అందువల్ల వీటినే జాగ్రత్తగా వాడుకోవాలన్నాడు. దానికోసం 'సాబ్' వెంటనే వీటికి అడుగున నాడాలు వేయించుకున్నట్లయితే యిహ జీవితాంతం చెక్కు చెదరవన్నాడు. కేవలం ఒక్కొక్క నాడా పదిపైసలే నన్నాడు. పది నిముషాల్లో వేసేస్తా నన్నాడు.

ఈసారి నాకు నవ్వొచ్చింది. వాడి వ్యాపారదక్షతకి ముచ్చటవేసింది. అంత చిన్నతనంలో అంత తెలివితేటలుగా మాట్లాడ్డం ఆశ్చర్యం వేసింది. పోనీ ఎంతకనక? అంతా కలిపి రూపాయి చిల్లర వుతుంది. అందులో పెద్ద నాకు వచ్చిన నష్టంకూడా లేదు. బూట్లుకూడా అరగకుండా ఉంటాయి. వాడికీ పాపం వో రూపాయిచ్చినట్లూ ఉంటుంది. అందుచేత అలాగే చెయ్యమని అదంతా అయ్యేదాకా అక్కడే నించోవడం విసుగనిపించి కొంచెం పక్కగా ఉన్న షాపులు పరిశీలించడం మొదలుపెట్టాను.

ఓ ఇరవై నిముషా లయ్యాక తిరిగి వాడిదగ్గర కొచ్చేసరికి బూట్లు నిగనిగలాడుతూ చక్కగా కనపడ్డాయి. కుర్రాడు పరవాలేదనిపించింది. పర్సుతీసి 'ఎంత'ని అడిగేను. వాడు "ఆరురూపాయల" న్నాడు. నాకు అర్థంకాలేదు. మళ్ళీ అడిగేను. అయితే వాడు మామూలుగానే "అంతే" అన్నాడు. నాకు ఆశ్చర్యం. దాన్ని మించి కోపం వచ్చాయి. 'ఎలాగ' అని గట్టిగానే అన్నాను.

వాడు తొణక్కుండా బూట్లు చేత్తో పట్టుకొని చెప్పాడు. మామూలు పాలిషయితే పావలాట. కాని కలర్ పాలిషయితే రెండురూపాయలట. ఒక్కొక్క నాడా పదిపైసల చొప్పున నలభై నాడాలు నాలుగురూపాయలట. అంచేత రెండూ

కలిపితే ఆరురూపాయలని లెక్కని విడ మరచి చెప్పాడు.

అయితే నాకు నల్లభై నాడాలంటా దేవి టని అదేవిటన్నాను. వాడు బూట్లు తిర గేసి చూపించాడు. ఒక్కొక్క బూటు క్రింద అంగుళం అయినా ఖాళీ లేకుండా నాడాలతో తాపడం చేసుంది. నాకు వెర్రెత్తింది.

"ఇన్నెవరు కొట్టమన్నారు?" అన్నాను.

"మరింకెన్ని?" అన్నాడు అదోలా.

"ఒక్కొక్కదానికి మూడుచొప్పున కాదా కొట్టాల్సింది?" అన్నాను.

"మీ రలా చెప్పందే," అన్నాడు.

ఇంతలో అటూ యిటూ షాపులవాళ్లు, పోతున్న జనం ఆగి పల్లెటూరివాడిని చూసినట్లు చూస్తున్న ట్లనిపించింది. అది చూసి వాడు మరీగట్టిగా మాట్లాడ్డం మొదలు పెట్టాడు. దానితో నాకు యింకా అక్కడ వాదన వేసుకోవడం, అరవడం చిరా కనిపించి మాట్లాడకుండా ఆరురూపా యలు వాడిముందు పడేసి జోళ్ళు తొడు క్కొని వచ్చేశాను.

*　　　*

తరువాత రైల్లో నా కది జ్ఞాపకం వచ్చి ఆలోచిస్తే వాడు నన్ను మోసం చేశాడని తెల్సినా ఎందుకో నాకు కోపం మాత్రం రాలేదు. ఎందుకంటే పాపం వాడిదికూడా అందరిలాంటి బతుకే ననీ వాడిమీదా ఇంకెవరో ఆధారపడి బతుకు తూండొచ్చనీ, అస్తమానూ వాడికి నా లాంటి క్రొత్తవాళ్ళు దొరకరనీ, అటు వంటి రోజున వాడికి పండుగేననీ అను కొని, పోన్లే పాపం కనీసం యీ వొక్క రోజన్నా నాపేరు చెప్పుకొని ఆనందంగా గడుపుతా డనుకున్నాను.

కాని అంత చిన్నతనంలోనే ఇటువంటి మోసాలు నేర్చుకున్నవాడు పెద్దయిన తరువాత ఏంచేస్తాడో ఊహించడం అంత కష్టం కాదు. బహుశా, జేబులు కత్తిరించొచ్చు, దొంగతనాలు చెయ్యొచ్చు. ఇంకా ఏమైనా చెయ్యొచ్చు. అవి చేసి నపుడు వాడు అనుభవించబోయే శిక్షలు తల్చుకొని వాడిని అందులో ఊహించే సరికి నాకు వాడంటే విపరీతమైన జాలి వేసింది.

తిరిగొచ్చిం తర్వాత యీ కథ చాలా మందితో చెప్పాను. విన్నవాళ్ళంతా అయిపోయిన తరువాత వెధవమొహం పెట్టి "నువ్వెందుకూ పనికిరావోయ్" అన్నారు.

అయితే ఒక్క మా ఆవిడమాత్రం ఇదంతా విని ఏమీ అనలేదు కాని నావేపు జాలిగా చూపింది. ఎందుకో మరి?




ఆయన పేరు నారపరాజుగారు. వరుసగా ఆరు సంవత్సరాల నుంచి ఆయన సెంట్రల్ మినిష్టరు పదవిని నిర్వహించారు. ఆరు లకారాల పైనే సంపాదించారని ప్రతీతి. ఆయన ఇద్దరు కుమారులూ ఫారిన్‌లో చదువుకుంటున్నారు.

ఒక్కగా నొక్క కుమార్తెకు మొన్నీ మధ్యనే రెండు లకారాల కట్నం ఇచ్చి వైభవంగా వివాహం జరిపించారు.

ఆయనకో అందమైన భార్య. ఆవిడ పేరు మీనాక్షి. నాలుగైదు మహిళా సంస్థలకు ఆవిడ ప్రెసిడెంటుగానూ, సెక్రటరీగానూ వ్యవహరిస్తూన్నారు. ఆవిడ కో అందమైన బ్యూక్ కారు, మరో అందమైన చిన్న బొచ్చుకుక్కపిల్ల టామీ వున్నాయి.

ఆ ఇంటినిండా బోలెడంతమంది నౌకర్లు చాకర్లు వున్నారు. అందమైన వాళ్ళ డాబాముందు ఓ చిన్న పూలతోట. దానికో తోటమాలి వున్నారు.

అమ్మగారూ, అయ్యగారూ, రోజులో చాలాభాగం వుపన్యాసాలకు, సభలకు వెళ్ళిపోతూంటారు. బొచ్చుకుక్క పిల్ల మాత్రం చక్రవర్తిలాగా, ఆ డాబాలోనూ, తోటలోనూ, వీధిలోనూ, షికార్లు చేస్తూంటుంది. ఆ కుక్కపిల్ల అంటే అమ్మగారికి పంచప్రాణాలు. అది ఓపూట అన్నం తినకపోతే, ఆవిడకు నిద్రపట్టదు.

అంతదాకా ఎందుకు? ఓసారి ఎవరో ఓ దౌర్భాగ్యుడు, వుద్యోగంకోసం, రెకమండేషన్ లెటరుకోసం, అయ్యగార్ని యాచించటాన్కి, పొట్టకు బదులు, గొడుగు చేతబట్టుకుని వచ్చాడు. దరిద్రానికి ప్రతినిధిలా వున్నవాడిని చూచి, టామీ బొయ్‌మంటూ వాడిమీద పడింది. ప్రాణ రక్షణార్థం ఆ దౌర్భాగ్యుడు చేతిలోవున్న గొడుగుతో దాన్ని ఓ దెబ్బ వేశాడు. టామీ కుయ్యోమంటూ ఇంట్లోకి పరుగెత్తింది. ఆ సమయాన్కి అమ్మగారు ఇంటిలోనే వున్నారు. జరిగింది తెలుసుకుని ఆవిడ మూడోనేత్రం తెరిచి, భర్తకు ఫిర్యాదు చేశారు. ఆ దెబ్బతో ఆ దిర్భాగ్యుడికి ఉద్యోగం రాకపోగా, వాడి అన్నగారు చేస్తున్న ఉద్యోగంకూడా వూడిపోయింది. అంత ఇన్ఫ్లూయెన్సు సంపాదించుకుంది టామీ ఆ ఇంట్లో.

శ్రీవారి ఇంటి కెదురుగా ఓ చిన్న పెంకుటిల్లు. ముప్ఫయి సంవత్సరాలు ఎన్. జి. వో. గా చేసినవాడి నెత్తిన, వూడిపోయిన వెంట్రుకల్లా, ఆ ఇంటి కప్పుమీద పెంకులు లేచిపోయి, చిందరవందరగా వున్నాయి. ఆ ఇంట్లో ఓ రిటైరయిన బడిపంతులు, వడిలిపోయిన వంకాయలాంటి ఆయన భార్య, ఆయన సంతానం ఏడుగురు మొగపిల్లలు, ఏడుగురూ ఎన్. జీ. వో. లుగా ఆ వూరిలోనే బ్రతుకుతున్నారు. ఆ ఏడుగురి భార్యలూ, వాళ్ళ పిల్లలూ, వెరశీ ఆ కొంపలో ఓ పాతికమందిదాకా జనాభా బ్రతుకుతున్నారు.

పంతులుగారి భార్య ఈరోజు ఒక ఘోరమైన అపరాధం చేశారు. ఆవిడ మడికట్టుకుని వంట చేసుకుంటూంటే, నారపరాజుగారి బొచ్చు కుక్కపిల్ల, షికారుగా సరాసరి పంతులుగారి వంటింట్లోకి వచ్చేసింది.

కార్డియోగ్రాఫ్ చూశాను - మీ గుండె చాలా బలహీనంగా వుంది - నా బిల్లు మూడు వాయిదాల్లో పంపుతాను!!




"అయ్యో! అయ్యో! పాడుకుక్క!" అంటూ బుగ్గలు నొక్కుకుని. చేతిలో వున్న గరిటె దానిమీదకు విసురుతూ "ఛీ....ఛీ ..." అన్నారు. ఆ గరిట సరాసరి వెళ్ళి టామీ కుడికాలుకు తగిలింది. అది కుయ్యోమంటూ, కుంటుకుంటూ వెళ్ళిపోయింది.

పంతులుగారింట్లోంచి, టామీ కుంటు కుంటూ రావటం తోటమాలి చూశాడు. క్షణాలమీద వెళ్ళి, A. C. రూమ్‌లో వున్న అమ్మగార్కి ఆ విషయం మనవి చేశాడు ఆవిడ తల్లడిల్లిపోయింది.

కుంటుకుంటూ వచ్చిన కుక్కపిల్లను ఎత్తుకుని, కళ్ళనీళ్ళ పర్యంతం అయి, కాసేపటికి రౌద్రాకారం దాల్చి, శ్రీవారి సమాలోచనామందిరానికి నడిచారు.

ఆ సమయంలో శ్రీవారు వందరూపా యల కట్టలు ఓ పది టేబులుమీద పడేసి, "చూడు, నాగరాజూ! ఈ లక్ష రూపాయలూ ఓటర్లందరికీ పంచిపెట్టు. పబ్లిసిటీ గ్రాండుగా చేయించు. మన ప్రత్యర్థిగాడు చిత్తయిపోవాలి. ఆడి వోట్లుకూడా మనకే పడాలి," అంటూ విలాసంగా మీసం దువ్వుకున్నారు.

నాగరాజు, అతని అనుచరులు డబ్బు మూటకట్టుకుని, "మీరేం కంగారు పడమాకండి. విజయం మీదే! ఆ రెడ్డిగాడిని చిత్తుచిత్తుగా ఓడించే పూచీ మాది," అంటూ వెళ్ళిపోయారు.

ఈలోగా అమ్మగారు వచ్చి, జరిగిన కధంతా వినిపించి, ఆ పంతుల్ని పిలిచి గట్టిగా చీవాట్లు వెయ్యమని చెప్పి కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు,

నారపరాజుగారు తాపీగా చుట్ట వెలి

గించి, పంతులుగారి కోసం కబురు పంపారు. ఓ పదినిమిషాల తర్వాత పంతులుగారు చేతులుకట్టుకుని శ్రీవారి ముందు నిలబడ్డారు. శ్రీవారు సతీమణితో కొలువు తీర్చియుండగా, పంతులుకి ఏం మూడిందో చూద్దామని, నౌకర్లు గది వెలుపల ఆతృతగా చూస్తూ నిలబడ్డారు.

పంతులుగారి గుండెలు గుబగుబ లాడుతున్నాయి.

నారపరాజుగారు పంతుల్ని చూసి చిరునవ్వు నవ్వి. "రండి పంతులుగారూ! రండి. కూర్చోండి. అన్నట్లు మీకు పిల్ల లెంతమందన్నారు? ఏడుగురు కదూ? నా మతి మండిపోనూ, ఏ విషయమూ సరిగ్గా గుర్తుండి చావదు. అందరికీ పెళ్ళిళ్ళు అయిపోయాయిగా? ఏమిటోనండీ, మీరు ఇన్ని సంవత్సరాలనుండి మా యింటి ముందే వున్నారా, మీ గురించే నాకు సరిగా తెలియదు. ఏవేవో బాధ్యతలు! తీరిక వుండదు. గాంధీగారు పొరుగు వాడిని ప్రేమించు అన్నారు. నాకేమో దేశ సేవకే టైము చాలటంలేదు. పొరుగున వున్న మీబోటివారి క్షేమసమాచారాలు తెలుసుకునేందుకు నిమిషంకూడా వీలుపడి చావటంలేదు. అన్నట్లు మీకు పెళ్ళీడు కెదిగిన ఓ అమ్మాయి వుండాలను కుంటాను?'' అన్నారు.

"అవును, బాబుగారూ. రేపు వైశాఖంలో దానికి పెళ్ళి." అన్నారు పంతులుగారు.

"ఎంతమాట! చెప్పారు కారేం మరి? పాపం! ఈ రోజుల్లో ఆడపిల్లల పెళ్ళిళ్ళు చెయ్యటం అంటే మాటలా? మాబోటి వాళ్ళకే కష్టంగా వుంది. ఇదిగో ఈ వంద రూపాయలూ నా కానుకగా మీ అమ్మాయి వివాహానికి వుపయోగించండి. మొహమాట పడకండి, మాష్టారూ! పొరుగు వాళ్ళం! ఆ మాత్రం ఆదుకోకపోతే ఎలా? పెద్దవయసు! కూర్చోమంటే కూర్చోరాయిరి! నిలబడి ఎంతసే పుంటారు? అసలే చలికాలం. వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. అప్పుడప్పుడు కన పడతారుగా?'' అంటూ చుట్ట నోటిలో పెట్టుకున్నారు శ్రీవారు.

పంతులు నమస్కరించటంకూడా మరిచిపోయి, అయోమయావస్థలో ఇంటి వైపు నడిచాడు.

''ఏమిటండీ మీరు చేసిన పని? కుక్కపిల్ల కాలు విరగ్గొట్టారు, పిలిచి చీవాట్లు వేయండి అంటే, వందరూపాయలతో సత్కరించి పంపుతారా? మీకు మతుందా, పోయిందా?'' అంటూ నిప్పులు క్రక్కారు అమ్మగారు.

"పిచ్చిదానా ... ఏడుగురు కోడళ్ల.... పంతులుగారు.... కొడుకులు... ఎలక్షన్లు... ఇరవై రోజుల్లోకి వచ్చేశాయి అప్పుడే!'' ఫిలప్ ది బ్లాంక్స్ అంటూ హడావిడిగా వెళ్ళిపోయారు రాచకార్యాలమీద శ్రీవారు.

అమ్మగార్కి ఆయనమాటలు అర్థం కాక అయోమయంగా చూస్తూ నిలబడ్డారు శ్రీవారు వెళ్ళినవైపు. చేతుల్లో వున్న బొచ్చుకుక్కపిల్ల జాలిగా నాకుతూ, అమ్మగారికేసి చూడసాగింది.



# సంసార చక్రం

అరెకపూడి (కోడూరి)
కౌసల్యాదేవి

(గత సంచిక తరువాయి)

ఆశ్చర్యంగా చూడడం మినహా ఏమీ మాట్లాడలేకపోయింది సుభద్ర.

చిన్న పిల్లవాడికి స్నానం చేయించుతూన్న కమల, లీలా సుభద్రలను చిరునవ్వుతో ఆహ్వానించింది.

"కూర్చోండి! ఇప్పుడే వస్తాను" అంటూనే వంటింట్లోకి వెళ్తూంటే "ఏమిటది? ఇప్పుడేం వద్దు. ఇలారా!" అని పిలిచింది లీల.

"ఏంలేదులే, కొంచం కాఫీ! అంతే. యింకా నేనూ త్రాగలేదు."

కమల వంటింట్లోకి వెళ్ళగానే లీల నెమ్మదిగా అంది: "చూశావా, ఆఫీసు నుంచి వస్తూనే యింటి పనుల్లో మునిగిపోతుంది. కాస్త కాఫీ యిచ్చే దిక్కూ కూడా వుండదు ఆమెకు ఈ యింట్లో." అన్నది.

లీలకూ, సుభద్రకూ కాఫీ యిచ్చి, "బాగున్నావా సుభద్రా, ఎప్పు డొచ్చావ్?" అనడిగింది కమల.

"నాలుగు రోజుల క్రితం. నువ్వు ఉద్యోగం కూడా చేస్తున్నావట?" తిరిగి ప్రశ్న వేసింది సుభద్ర.

తేలికగా నవ్వేసింది కమల. "ఏదో యిద్దరూ సంపాదించనిదే ఈ రోజుల్లో మా సంసారాల్లాటి సంసారాలు నడవడం కష్టం."

అంతలోనే కమల ఆడబిడ్డ వచ్చింది. "వదినా, నేను సినిమాకు వెళ్లాలి. రెండు రూపాయ లియ్యి."

మాట్లాడకుండా లేచి యిచ్చి వచ్చి కూర్చోబోయేసరికి అత్తగారు ప్రవేశించింది పొరుగింటి పెత్తనాలనుంచి. "ఏం

కమలా, వంటంతా అయ్యిందా?'' అనడి గింది వస్తూనే.

''అయ్యిందండి'' కమల జవాబు.

''అయితే మీ మామగారికి వడ్డించి పిలువు. షికారునుంచి వచ్చేశారు.''

''అలాగే.''

''అయినా అన్నీ నేనే చెప్పాలా? కుర్రపిల్లలాగా కబుర్లేసుకు కూర్చుంటే ఎలాగా అత్త మామల్ని కూడా మరచి పోయి?'' అని సణుక్కుంటూ వెళ్ళి పోయింది అత్తగారు.

ఉస్సురంటూ లేచింది కమల, స్నేహి తులవైపు దీనంగా చూస్తూ.

కమల పరిస్థితిని గ్రహించిన లీల ''ఫర్వాలేదులే కమలా, బాధపడకు. నేనేం క్రొత్తదాన్నా? రేపు ఆఫీసులో కలుస్తాలే. మరేం లేదు. ఆ ఉద్యోగం గురించి అడు గుదామని వచ్చాను'' అంటూ లేచింది. సుభద్ర కూడా లేచింది వీడ్కోలు తీసు కుంటూ. కమల నిస్సహాయంగా చూస్తూండి పోయింది.

''చూశావా పెళ్ళై ఉద్యోగం చేసే ఆడ దాని బాధలు! సంపాదించి పెడ్తోందన్న గౌరవమూ లేదు; చాకిరీ చేసి సుఖపెడ్తోం దన్న విశ్వాసమూ లేదు. ఇటువంటివి చూస్తూంటే పెళ్ళిమీద ఆశ ఎలా కలుగు తుంది సుభద్రా నాకు?'' అన్నది లీల రోడ్డు మీదికి వచ్చాక.

తలపంకించింది సుభద్ర. ''సహజమే. ఆ భర్తగారైనా ఏమీ మాట్లాడడా మరి?''

''అయ్యోరాత, బుద్ధావతారం. ఆ ప్రక్కగదిలోనే కూర్చున్నాడు. చూడ లేదూ నువ్వు?''

''చూశానులే!''

''అంతే అలాగే వుంటాడు నోరు లేనట్టు. బహుశః భార్యను తన కళ్లెదుటే తల్లి ఉరితీసి పారేసినా నోరెత్తడు ఆ శ్రీరామచంద్రుడు!'' ఆ కమల ఇంటితో ఎంతో సన్నిహిత అనుబంధం కల లీల ఎన్నెన్నో సంఘటనలు చూచి వుంటే తప్ప అంత అసహ్యం వెలిబుచ్చదు!

''మాట్లాడవేం సుభద్రా?'' తిరిగి అడిగింది.

మందస్వరాన అన్నది సుభద్ర. ''అహ! ఏమున్నదిలే మాట్లాడడానికి. కాని అందరూ అలాగే వుండరు లీలా. నేనేమైనా చదువు కున్నానా, కట్నం కానుకలతో వెళ్లానా? అయినా మావారు నన్ను ప్రాణంగా చూస్తారు.''

''అది నీ అదృష్టం. కాని ఆడవాళ్ళలో అధిక సంఖ్యాకులకు అటువంటి అదృష్టం అందదు సుభద్రా!''

ఇంటికి వచ్చాక కూడ సుభద్ర యోచ నలు బహుదారులై పయనించసాగాయి. ''ఆస్తీ, అంతస్తూ, అందమూ అన్నీ వున్న కుసుమ అవన్నీ మరింత అధికంగా గల మొదటి పెళ్ళి యువకుడినే వివాహ మాడింది. కాని....కాని ఆమె బ్రతుకెలా గుంది ఈనాడు? నిజంగా అంతకంటే మరణం అన్నివిధాలా మంచిది.........




చదువూ సంస్కారం సౌందర్యంగల కోమలి అన్ని విధాలా తనకు దీటైన పురుషుడినే చేసుకొంది. కాని ఈనాడు సిగ్గు విడచి "ఈ మొగుడు నా కొద్దు" అంటూ కోర్టుకెక్కింది. ఛీ, ఏం బ్రతుకు? ఏమో ఆ సంసారంలో ఎన్ని సుడి గుండా లున్నాయో? చక్కగా చదువుకుని, లక్షణమైన పెళ్ళి చేసుకుని, నిక్షేపంగా ఉద్యోగం చేసుకొంటూన్న కమల బ్రతుకు గొడ్డు చాకిరీకే కదా అంకితమైపోయింది? వెదకి చూచినా ఆ సంసారంలో గురు వింద గింజలో వెయ్యోవంతైనా ఆనంద మున్నదని అన్పించటంలేదు. ఇక లీల- చదువులో రూపంలో నా కంటె మెరుగే. కాని తనవారికోసం ఆమె వివాహాన్నే త్యాగం చేస్తోంది!

'పోల్చి చూస్తే ఈ అందరికంటే నేను ఎన్నో రెట్లు తక్కువదాన్ని వ్యక్తిగతంగా. నాకు విద్యలేదు, వినయంలేదు. ధనం లేదు. సంస్కారం లేదు. అయినా నా సంసారం ఎంతో ఆనందంగా వుంది. వెదకిచూచినా ఎలాటి అశాంతి లేదు. లేనిపోని ఊహలతో నేను కల్పించుకొనే అశాంతి, అర్థంపర్థంలేని ఆవేశంతో నేను సృష్టించే అసంతృప్తేకాని. వీరందరితో పోల్చిచూస్తే నిజానికి నా సంసారం

ఆనందమయం కాదూ!'

ప్రక్క వాటాలోంచి విన్పిస్తూన్న గొడవతో సుభద్ర ఆలోచనా వాహినికి తాత్కాలికాంతరాయం కలిగింది.

"ఎన్నాళ్ళుగా ఈ గొడ్డుమోతుదానితో కాపురం? ఇహ మనవలని చూచుకొని మురిసే యోగంలేదా నాకు? ఆ గొల్లపూడి సంబంధంవాళ్ళు యిందాక వచ్చారు. నీ ఇష్టం మరి!" అంటోంది ఒక ముసలి స్త్రీ.

"నీ ఇష్టం వచ్చినట్టు కానీయమ్మా!" కుమార రత్నం కాబోలు సమాధానం యిస్తున్నాడు.

"ఏమిటి మీ గూడుపుఠాణీ?" వెక్కిళ్ళతో ఒక స్త్రీ కంఠం."పిల్లల్లేరని మళ్ళీ చేసుకోవటానికిదేం పాతకాలమా? అయినా నాకే మంత వయసై పోయిందని యిక పుట్టరనుకోవటానికి? ....ఏళ్ళు గడవగానే సరా? ఇటువంటి సలహా యిస్తారా మీరు కొడుక్కి ఆడదై వుండీ కూడ?"

"అయ్యో! అయ్యో! చూడరా అత్త నన్నైనా లేకుండా ఎంతలేసి మాటలంటూ న్నదో! పళ్ళు రాలగొట్టు, పొగరణుగు తుంది." అత్త ఆవేశంతో ఊగిపోతూ కొడుక్కి నూరిపోస్తోంది.

"అత్తైతే యేమిటి? పెద్దరికం నిలబెట్టు కోవాలి కాని ఇదే మీ కూతురై తే మీ రంత ఘాతుకంగా ఆలోచించేవారేనా?" కోడలు ఉక్రోషంగా అడుగుతోంది. "ఏమో, ఇంకొకతెకు మాత్రం పిలలు పుడతారని యేమిటి భరోసా?"

"నోర్ముయ్, ఏమిటి మరీ వదరు తున్నావ్?" పురుషకంఠం అరవడం, ఆ వెంటవే గొడ్డును బాదుతూన్నట్టు బాదడం వినరాసాగింది.

వింటూన్న సుభద్ర వణకిపోయింది. యమయాతన ననుభవిస్తూన్న ఆ యువతి పార్వతిని తాను ప్రొద్దున్న చూచింది. మనసులో అనుకొంటూన్న మాటను అంతలో అటుగా వచ్చిన తల్లితో అన్నది: "అంతందంగా వుంటుంది నా కంటె చిన్నదేనేమో కూడ, దరిద్రుడికిచేతులెలా వస్తున్నాయో అలా కొట్టటానికి!"

"అఁ! రోజూ జరిగే భాగోతమేలే. వెధవగోల మనకెందుకు గానీ రా భోజనం చేద్దువుగాని." సంసారంలో రాటుదేలి పోయిన ఆ ప్రౌఢ స్త్రీలో యిటువంటి సంఘటనలు చలనమే కలిగించవు.

ఈ కుసంస్కారులకూ తన భర్త చలపతికీ ఎన్నియోజనాల దూరమున్నదో పోల్చి చూసుకుంటూ తల్లి వెనుక నడ చింది సుభద్ర. వివాహానంతరం ప్రప్రథమంగా ఆమె అనుకున్నది మనస్సులో పరిపూర్ణ తృప్తితో: "నేను అదృష్టవంతు రాలిని. నా భర్త ఉత్తముడు!"

దగ్గరే కూర్చుని మరింత కొసరి కొసరి వడ్డిస్తూన్న తల్లిని "అబ్బ చాల్లేమ్మా. ఎంత తినమంటావు?" అన్నది నవ్వుతూ సుభద్ర

"అయ్యో, ఇక్కడున్న నాలుగు రోజులూ కాస్త కుదురుగా కావలసినవన్నీ




తృప్తిగా తినమ్మా. సవతి పిల్లలూ, మాయదారి చాకిరీతో అక్కడ ఏం తింటున్నావో ఏమో!''

సుభద్ర ఆశ్చర్యం అవధులు దాటిపోయింది. ఆ యింట తాను బుద్ధెరిగిన నాటినుండీ తల్లి నోట అంతటి ప్రేమపూరిత పదజాలాన్ని ఏనాడూ విని వుండలేదు. 'పెళ్ళవ్వని మొద్దు' 'గుదిబండ'. . ఇటువంటివే తన నామాంతరాలు. పట్టెడు మెతుకులు పెట్టి పోషించడమే ఘనంగా భావించుతూ నిత్యం తనపై ధుమధుమలాడుతూండే తల్లి యిలా మారిపోయిందంటే దూరం ప్రేమను పెంపొందిస్తుంది కాబోలు మరి!

''ఇంకొంచం మజిగ వేసుకోవే అమ్మా. ఇంతకూ ఆ మాయదారి మూక నిన్ను భోజనమదీ సరిగా చేయనిస్తారా?''

ఈసారి తల్లి మాటలకు కించిత్ కోపం కలిగింది సుభద్రకు. అయినా సాధ్యమైనంత ఓర్పుతోనే శాంతంగా చెప్పింది జవాబు. ''ఆ యింట్లో భోజనానికి లోటేమిటమ్మా? అసలు మనయింట్లో మనం తినేది అందులో ఎన్నోవంతూ కాదు!''

''అహా(. అలాగా!'' తల్లి కంఠస్వరంలో అసంతృప్తి స్పష్టంగా కన్పించటంతో తాను అలా అని వుండకూడదేమో నన్పించింది సుభద్రకు.

ఈసారి తల్లి ప్రసంగం తీరు కొత్త మార్చింది. "నీతోటి పెళ్ళైనవాళ్ళంతా యింక ఆరేడునెలల్లో పాపాయిల్నెత్తుకో పోతున్నారు. మరి నువ్వు ఇంకా ...." అంటూ అర్ధోక్తిలో ఆపేసింది.

సుభద్ర తన చికాకును పైకి ప్రస్ఫుటం కానీకుండా ఒక్క చిరునవ్వునవ్వి వూరు కుంది.

"ఏదో పెద్దవాళ్ళం. మీ సంసారాల్ని చూచీ, మీ బిడ్డల్నిచూచీ సంబరపడాలని ఎదురుచూస్తుంటాం, మాయదారి సవతి మూక ఎందరుంటే ఏమిటి, నీ బిడ్డలంటూ నీ కుండాలిగా ని!"

సుభద్ర మనస్సుకు ఆ మాటలు నొప్పి తోచాయి. "నువ్వనుకుంటున్నట్లుగా వాళ్ళ వల్ల నా కెటువంటి కష్టమూ లేదమ్మా. అయినా సవతిబిడ్డలున్నారని తెలిసేకదా రెండో పెళ్లి చేశావ్? ఇప్పుడు క్రొత్తగా వాళ్ళకోసం వాపోవడం దేనికి?" అంటూ చేయికడుక్కు లేచింది.

"దెప్పవే అమ్మా దెప్పు, ఏంచేస్తానూ? అంతకంటె గతిలేనిదాన్ని గనకే మరి రెండోపెళ్లి వాడికి కట్టబెట్టాను." అంటూ ముక్కు చీదింది!

"అసలు పెళ్ళవకుండా పుట్టింట పడి వుండేకంటె ఏదో ఓ పెళ్లి అవ్వటమే చాలనుకుని చేశానే అమ్మా." అన్నది మళ్ళీ, క్రొత్తగా తెలియని విషయమేదో చెప్తూన్నట్లు.

"అవును," గంభీరంగా అన్నది సుభద్ర, "అది నాకూ తెల్సు, అందుకే, అసలు పెళ్ళయ్యే యోగమే లేదనుకున్న నాలాటిదానికి ఆ యోగ్యత కలిగించి మీ బరువు దింపిన ఆయింటి వ్యక్తులను నేను అనవసరంగా ద్వేషించి ఆడిపోసుకోను".

కుమార్తె విసుగుదలను గ్రహించింది తల్లి. "ఏమోనే అమ్మా ఇది కలికాలం మరి, తలిదండ్రులు శక్తికొలదీ ఎంత జేసినా, ఇంకా నిష్ఠురమాడుతారు ఈ కాలపు పిల్లలు, అయినా తల్లీ తండ్రీ ఏం జేసినా, ఏం జెప్పినా నీ మేలుకోరేగా!" అంటూ అక్కడినుంచి నిష్క్రమించింది, కుమార్తె కళలు ప్రస్తుతానికి తనకు అను గుణంగా లేవని గ్రహించి.

## 15

సాయంత్రం స్నానంచేసి వచ్చి జడ అల్లుకుంటూన్న సుభద్ర దగ్గఱకువచ్చి, "ఎక్కడికి వెళ్ళడానికి అక్కా.. తయారౌ తున్నావ్?" అనడిగింది చెల్లెలు సరళ.

"ఓసారి అలా నీల యింటికి వెళ్ళొ ద్దామనీ," అన్నది సుభద్ర.

"పోనిద్దూ లీల ఇంటికి దేనికి? ఏదైనా సినిమాకు వెళ్దాం రావూ?" గోముగా అడిగింది.

"వెళ్దాంలే రేపో ఎల్లుండో."

"కాదక్కా. ఆ సినిమా ఇవ్వాళ్టితో వెళ్ళిపోతుంది. నాన్న, అన్నయ్యలూ ఎవ్వరూ డబ్బులివ్వలేదు అడిగితే, నువ్వు




తృప్తిగా తినమ్మా. సవతి పిల్లలూ, మాయదారి చాకిరీతో అక్కడ ఏం తింటున్నావో ఏమో!''

సుభద్ర ఆశ్చర్యం అవధులు దాటిపోయింది. ఆ యింట తాను బుద్ధెరిగిన నాటినుండీ తల్లి నోట అంతటి ప్రేమ పూరిత పదజాలాన్ని ఏనాడూ విని వుండలేదు. 'పెళ్ళవ్వని మొద్దు' 'గుదిబండ'. . ఇటువంటివే తన నామాంతరాలు. పట్టెడు మెతుకులు పెట్టి పోషించడమే ఘనంగా భావించుతూ నిత్యం తనపై ధుమధుమలాడుతూండే తల్లి యిలా మారిపోయిందంటే దూరం ప్రేమను పెంపొందిస్తుంది కాబోలు మరి!

''ఇంకొంచం మజిగ వేసుకోవే అమ్మా. ఇంతకూ ఆ మాయదారి మూక నిన్ను భోజనమదీ సరిగా చేయనిస్తారా?''

ఈసారి తల్లి మాటలకు కించిత్ కోపం కలిగింది సుభద్రకు. అయినా సాధ్యమైనంత ఓర్పుతోనే శాంతంగా చెప్పింది జవాబు. ''ఆ యింట్లో భోజనానికి లోటేమిటమ్మా? అసలు మనయింట్లో మనం తినేది అందులో ఎన్నోవంతూ కాదు!''

''అహా. అలాగా!'' తల్లి కంఠస్వరంలో అసంతృప్తి స్పష్టంగా కన్పించటంతో తాను అలా అని వుండ కూడదేమో నన్పించింది సుభద్రకు.

ఈసారి తల్లి ప్రసంగం తీరు కాస్త మార్చింది. "నీతోటి పెళ్ళైనవాళ్ళంతా యింక ఆరేడునెలల్లో పాపాయిల్నెత్తుకో పోతున్నారు. మరి నువ్వు ఇంకా ..." అంటూ అర్ధోక్తిలో ఆపేసింది.

సుభద్ర తన చికాకును పైకి ప్రస్ఫుటం కానీకుండా ఒక్క చిరునవ్వునవ్వి వూరుకుంది.

"ఏదో పెద్దవాళ్ళం. మీ సంసారాల్ని చూచీ, మీ బిడ్డల్ని చూచీ సంబరపడాలని ఎదురుచూస్తుంటాం. మాయదారి సవతి మూక ఎందరుంటే ఏమిటి. నీ బిడ్డలంటూ ఏ కుండాలిగాని!"

సుభద్ర మనస్సుకు ఆ మాటలు నొప్పి తోచాయి. "నువ్వనుకుంటున్నట్లుగా వాళ్ళ వల్ల నా కెటువంటి కష్టమూ లేదమ్మా. అయినా సవతిబిడ్డలున్నారని తెలిసేకదా రెండో పెళ్లి చేశావ్? ఇప్పుడు క్రొత్తగా వాళ్ళకోసం వాపోవడం దేనికి?" అంటూ వేయికడుక్కు లేచింది.

"దెప్పవే అమ్మా దెప్పు. ఏంచేస్తాను? అంతకంటె గతిలేనిదాన్ని గనకే మరి రెండో పెళ్లి వాడికి కట్టబెట్టాను." అంటూ ముక్కు చీదింది!

"అసలు పెళ్ళవకుండా పుట్టింట పడి వుండేకంటె ఏదో ఓ పెళ్లి అవ్వటమే మేలనుకుని చేశానే అమ్మా." అన్నది తల్లి. క్రొత్తగా తెలియని విషయమేదో చెప్తూన్నట్టు.

"అవును." గంభీరంగా అన్నది సుభద్ర. "అది నాకూ తెల్సు. అందుకే, అసలు పెళ్ళయ్యే యోగమే లేదనుకున్న నాలాటిదానికి ఆ యోగ్యత కలిగించి మీ బరువు దింపిన ఆయింటి వ్యక్తులను నేను అనవసరంగా ద్వేషించి ఆడిపోసుకోను".

కుమార్తె విసుగుదలను గ్రహించింది తల్లి. "ఏమోనే అమ్మా ఇది కలికాలం మరి. తలిదండ్రులు శక్తికొలదీ ఎంత జేసినా, ఇంకా నిష్ఠురమాడుతారు ఈ కాలపు పిల్లలు. అయినా తల్లీ తండ్రీ ఏం జేసినా, ఏం జెప్పినా నీ మేలుకోరేగా!" అంటూ అక్కడినుంచి నిష్క్రమించింది. కుమార్తె కళలు ప్రస్తుతానికి తనకు అనుగుణంగా లేవని గ్రహించి.

## 15

సాయంత్రం స్నానంచేసి వచ్చి జడ అల్లుకుంటూన్న సుభద్ర దగ్గఱకువచ్చి. "ఎక్కడికి వెళ్ళడానికి అక్కా. తయారౌతున్నావ్?" అనడిగింది చెల్లెలు సరళ.

"ఓసారి అలా నీల యింటికి వెళ్ళొద్దామనీ." అన్నది సుభద్ర.

"పోనిద్దూ లీల ఇంటికి దేనికి? ఏదైనా సినీమాకు వెళ్దాం రావూ?" గోముగా అడిగింది.

"వెళ్దాంలే రేపో ఎల్లుండో."

"కాదక్కా. ఆ సినీమా ఇవ్వాళ్టితో వెళ్ళిపోతుంది. నాన్న, అన్నయ్యలూ ఎవ్వరూ డబ్బులివ్వలేదు అడిగితే, నువ్వు

తీసుకెళ్ళవూ?'' బ్రతిమాల్తూ అడిగింది.

సుభద్రకు చెల్లెలి దీనవదనం చూచి జాలివేసింది. ఈ యీడులో తానూ అలాగే అన్ని సరదాలకూ ముఖంవాచి లోలోన బాధపడ్తూండేది అందుకే వెంటనే "సరే, నడు వెళ్దాం'' అన్నది. కాటుకా, బొట్టూ పెట్టుకుని వెనుదిరిగి చూచేసరికి ఇంకా సరళ అలాగే నిలబడివుంది.

"వెళ్దామన్నానుగా? తొందరగా తయారైరా. ఇంకా అల్లాగా నించున్నావేమిటి?'' అన్నది.

"నీ చీరలన్నీ భలే అందంగా వుంటాయి. ఇవ్వాళ్టికి నీదో మంచి చీరా నెక్లెస్ ఇయ్యవూ అక్కా?''

నవ్వింది సుభద్ర. "తీసుకోవే. దాని కేం!''

సరళకు ధైర్యం చిక్కింది. "ఆ నీలం షిఫాన్ చీరా, రవ్వల నెక్లెస్ యియ్యవూ?''

మాట్లాడకుండా తీసిచ్చింది సుభద్ర.

ప్రక్కగదిలోంచి అంతా వింటూన్న పెద్దవదిన గబగబా వచ్చేసింది ముఖం నిండా నవ్వు పులుముకుని. చేతిలో సన్న జాజుల మాల సుభద్రజడలో తురుముతూ "అయితే మా సుభద్రమ్మ ఇవ్వాళ మాకు సినిమా చూపించుతోందన్నమాట! భలే ఆడబిడ్డ!'' అన్నది. ఇంకా ఆమె మాట పూర్తికాకుండానే బిలబిలా రెండో వదిన వచ్చేసింది, "అవునుమరి. పిల్ల జమీం దారిణి అయిపోయిన ఆడబిడ్డాయె! వది నలకూ, పుట్టింటికీ ఆమాత్రం చేయి విది లించదా మరి! సుభద్రమ్మ ధర్మమా అని ఇవ్వాళ మనందరం ఫస్ట్‌క్లాస్ టిక్కెట్‌లో కూర్చో వచ్చు దర్జాగా!''

వదినల జాణతనానికీ, వాక్చాతుర్యానికీ లోలోన నివ్వెరపోవడం మినహా ఏమీ మాట్లాడలేక పోయింది సుభద్ర. వయసులో వుండి ఏ సరదాలూ తీరకుండా అందర్నీ ఆశగా చూస్తూ అల్లాడిపోతూన్న ఆడబిడ్డ అంటూ ఒకతె ఇంటవున్నదన్న సంగతే విస్మరించి, తమంత తాము సినీమాలకూ షికార్లకూ తిరిగివచ్చి, పైగా 'అన్నం పెట్టు. మంచినీళ్ళియ్యి' అంటూ అధికారంగా చేయించుకునే అన్నావదినలకు-ఆనాడు అసలు కంటికే ఆనని ఆడబిడ్డ ఈనాడు అతిమనంగా కన్పిస్తోంది! అతి తెలివిగా ఆప్యాయత చిలికిస్తూ, ముందరి కాళ్ళకు బంధంవేసి మాట్లాడుతూ తమ అవసరాన్ని జబర్దస్తీగా తీర్చుకుంటున్నారు! ఇదీ లోకం!

అంతా తయారై బయలుదేరబోయే సమయానికి పెద్ద వదినకు ఒక అద్భుతమైన ఆలోచన కలిగింది. "ఇక్కడ నిత్యం కారుల్లోనే తిరిగే ఆడబిడ్డగారు ఇక్కడ పాపం ఏం నడుస్తుంది లేండి. ఒక టాక్సీ తీసుకురండి'' అంటూ పర్మాయించింది భర్తకు, ఆ భార్యావిధేయుడు అందుకు సిద్ధమౌతున్నాడు.

వగదలచినట్టు నటిస్తూనే వాత పెట్టినట్లూన్న ఈ ధోరణినీ, కుయుక్తినీ మరి సహించలేక పోయింది సుభద్ర. ఎవరి

వైపూ చూడకుండానే స్థిరంగా అన్నది: "ఫర్వాలేదు. ఈ మాత్రపు నడకకే అలసి అరగిపోయే సుకుమారమూ, నడమంత్రపు సిరీ యింకా అబ్బలేదు నాకు. నేను ఈ యింట పుట్టి పెరిగినదాన్ననే సంగతీ, ఇక్కడ నేను పెరిగి పెద్దయిన పరిస్థితులూ జీవితమూ ఇంకా మఱచిపోలేదు; మఱచి పోను ఎన్నడూ....సరదాగా నడచి వెళ్ళి పోదాం రండి" అంటూనే వీధి గుమ్మం దిగి తానే ముందు దారి తీసింది.

వదినల మూతులుముక్కులూ ముఖాలు వంకరలు తిరిగాయి. "ఏదో బుద్ధితక్కువై సరదాపడ్డాం. ఈమాత్రానికే ఎన్ననిపించుకున్నామూ? ఖర్మ!" అని వాళ్ళలో వాళ్ళ గొణుక్కోవటం సుభద్రకు వినిపించక పోలేదు.

సినిమాలో ఒకళ్ళకి కాలక్షేపంగా తినటానికి వేరుసెనగకాయలూ, ఇంకొకరికి కూల్ డ్రింక్సూ, మరొకరికి కాఫీ వగైరాలు కావలసివచ్చాయి.

మౌనంగా అన్నీ కొనిచ్చింది సుభద్ర.

సినిమా చూసినంతసేపూ సుభద్రకు ఆలోచనలు పరిపరి విధాలపోయాయి. పదేపదే చలపతీ పిల్లలూ గుర్తుకు రాసాగారు. 'పిల్లలకోడిలా వెళ్ళడం యిష్టం లేదు. వీళ్ళంతా ఎందుకు మనతో?' అంటూ భర్తపై అతడి స్వీయసంతానం గురించే విసుక్కొని కట్టడి చేసింది విర్మోహమాటంగా. మరి ఈనాడు తాను చేసిందేమిటి? వీళ్ళందరినీ పెద్ద సైన్యం లాగా వెంటబెట్టుకు వెళ్ళాల్సిన అవసరం యేమొచ్చింది? పశ్చాత్తాపం వంటిదేదో మనసున మెదలి అంతకంతకు తీవ్రతరం కాసాగింది సుభద్ర మనసులో. ఇల్లు జేరిన తర్వాత కూడా ఆమెను ఆలోచనలు వీడలేదు.

దొడ్లో వెన్నెలలో మంచంమీద పడుకుని ఆలోచించసాగింది సుభద్ర. భర్త యేం చేస్తున్నారో! పిల్లలెలావున్నారో! నరసమ్మకు పని లొంగక ఇదివఱకులాగే చలపతి నానా అవస్థాపడ్తూంటాడుబహుశః, తొందరగా వెళ్ళి పోతేనే బాగుంటుందేమో!....అలవిమాలిన ఆలోచనల బారి నుండి తప్పించుకుని కాస్త మనస్సుకు వాతావరణం మార్పు కలిగిద్దామని తాను వచ్చిందిక్కడికి. కాని అదెంత తెలివి తక్కువ యోచన! ఇది స్వార్థపరులతో నిండిన యిల్లు! కృత్రిమానికి అందమైన రంగులువేసి తనవల్ల లాభం పొందాలని చూచే మనుషులు! ఏనాడూలేని ఆప్యాయతలు యీనాడు రావడానికి కారణమేమిటో గ్రాహ్యమౌతోంది మెల్లగా.

"ఏం చెల్లాయ్. ఒక్కతెవూ కూర్చుని ఆలోచిస్తున్నావ్." అంటూ చిన్నన్న ప్రభాకరం వచ్చి సుభద్ర చెంతనే కూర్చున్నాడు.

"బావగారు గానీ జ్ఞాపకం వచ్చారేమిటి?"

చిన్నగా నవ్వి ఊరుకుంది సుభద్ర.

"అయితే, బావ నిన్ను బాగానే




చూస్తాడా చెల్లాయ్?'' ఆప్యాయత రంగ రించిన స్వరంతో అడిగాడు.

మాట్లాడలేదు సుభద్ర.

''అదేం? మాట్లాడవేమిటీ? ఎటువంటి వాడతను?'' మళ్ళీ రెట్టించాడు ప్రభా కరం.

అన్నవైపు నిశితంగా చూచింది సుభద్ర. ''ఎందుకు నీకా వివరాలన్నీ? తెలుసుకుని యేం ప్రయోజనం?''

వినగానే ప్రభాకరం నివ్వెరపోయినా వెంటనే సంబాళించుకుని లేనినవ్వు తెచ్చు కుంటూ అన్నాడు:''అదేమిటలాగంటావ్? భలేగావుంది నీ ధోరణి. చెల్లెలి కాపురం ఎలావుందో తెల్సుకోవాలని అన్నకు వుండదా?''

''అయితే పెళ్ళైన నాలుగు నెల్ల అనం తరం నా అంతట నేన్నువచ్చాక ఈ వివ రాలు తెల్సుకోవాలని నీకు ఆరాటంగా వుందన్నమాట! అంతగా నా బాగోగులు కోరినవాళ్ళే అయితే మొక్కుబడిగా గుళ్లో ముడిపెట్టి పంపేసి మళ్ళీఒక్కసారైనా అటు వైపు చూడకుండా వుండగలరా?''

చెళ్ళున కొట్టినట్టున్న ఆ సమాధానానికి సిగ్గుతో చితికిపోయిన ప్రభాకరం యేమీ మాట్లాడలేక పోయాడు. కాని అక్కడే వరండాలో పడుకుని వున్న తల్లి అందు కుంది: ''బాగుందేవ్. నువ్వలా మాట్లా డితే ఇక మేమేం చెప్పగలం? మన స్థితి గతులేమన్నా నీకు తెలియనివా?''

సుభద్ర ఊరుకోలేదు. ''స్థితిగతులూ నాకు తెల్సు. పద్ధతులూ నాకు తెల్సు. అందుకే అడుగుతున్నాను మిమ్మల్ని. పెళ్ళై అత్తింటవున్న ఆడపిల్లని పుట్టింటి వాళ్లు కనీసం ఈ క్రొత్త రోజుల్లోనైనా

ఒక్కసారి వచ్చి పలకరించకపోవటం, ఒకసారి ఏ పండగకో పబ్బానికో అయినా వచ్చి వెళ్ళమని ఆహ్వానించకపోవటం యెంత చిన్నతనమో మీకు తెలియదా? వదినల పుట్టింటివాళ్లు యిక్కడికి యెన్ని సార్లు వచ్చి వెళ్తున్నారు? ఏడాదిలో వదినలు ఎన్నిసార్లు పుట్టింకి వెళ్ళివస్తారో నాకు తెలియదా? బొత్తిగా బరువు వదిలించేసుకున్నట్టు తోసి పారేస్తే యే ఆడపిల్లకైనా బాధగానే వుంటుంది."

"అమ్మో! ఇంకా యేమో అనుకున్నాను. పెళ్ళయ్యాక మన సుభద్ర మంచి మాటకారే అయ్యింది" హాస్యంగా ఎగరగొట్ట జూచాడు పెద్దన్న శంకరం. "ఫర్వాలేదు మారుటి పిల్లలతోనూ భర్తతోనూ బాగానే నెగ్గుకు రాగలదు!"

కాస్సేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

తర్వాత అతి తేలికగా నవ్వేస్తూ అన్నాడు ప్రభాకరం. "సరే తల్లీ నిష్ఠురాలుమానేసెయ్యి. ఈసారి పండగకు తప్పకుండా నిన్నూ మీ ఆయననూ పిల్చి తీసి కొస్తాం. సరేనా?......అయినా అతగాడి స్వభావమేమిటో, ఎలా ప్రవర్తిస్తారో తెలియదుకదా మేం వద్దామంటే! అందువల్ల సందేహించి కొంత....." అంటూ నాన్చేశాడు.

అతడు తెలివిగా విషయం దాటిస్తున్నాడని గ్రహించింది సుభద్ర. అందుకే మౌనం వహించింది.

"ఇంతకూ అసలు సంగతి చెప్పావు కాదు." తల్లీ ప్రభాకరం ఒక్కసారే అన్నారు.

"ఏమిటది?"

"అతనెటువంటివాడూ అని. ఆ పిల్లల్నే పట్టుకు వ్రేళ్ళాడ్తూంటాడా, నిన్నేమైనా కాస్త ఆదరంగా ప్రేమగా చూడటం అదీ యేమైనా వుందా?" గుసగుసలు పోతూ అడిగాడు ప్రభాకరం.

నిర్లక్ష్యంగా నవ్వింది సుభద్ర. "అవన్నీ ఇప్పుడు తెల్సుకొన్నందువల్ల యేం లాభం? సరిగా లేకుంటే మాత్రం ఎవరేం చేయగలరు? వరుడి గుణగణాలు గృహపరిస్థితి వివాహానికి ముందుగా జాగ్రత్తగా తెల్సుకోవలసిన విషయాలు. ఆడపిల్ల పుట్టినదాదిగా దాన్ని విరగడ చేసుకొనేవరకూ బరువుగా బాధగా చూచే మనలాటి యిళ్ళల్లో అటువంటి వాటన్నిటికీ తావెక్కడ? పదిమంది పిల్లలున్న వాడైనాసరే, పెళ్ళైన మరుక్షణంలోనే మరణించేవాడైనాసరే తాళికట్టిందే చాలన్నట్టు పెళ్ళి చేసేసి చేతులు కడుక్కొనే కుటుంబాలకు ఇక ఆ ఆడపిల్ల యేమైపోతే మాత్రం బాధా బెంగా యేముంటుంది?"

"ఆఁ ఏమిటో చదువుతావు పురాణం." సుభద్ర మాటలకు విలువ నివ్వకుండా అన్నది తల్లి. "ఏదో శక్తికొలదీ చేస్తారు కాని తలిదండ్రులు చస్తారా మరి? రెండో పెళ్ళి వాడికి చేశామనేగా నీ అక్కసంతా? యేం రెండో పెళ్ళైతే ఏమిటి మూడో




పెళ్ళైతే యేమిటి- ఇప్పుడు నీకేం లోటు వచ్చింది? చక్కటి నగలు పెడ్తున్నావ్, దివ్యమైన చీరలు కడ్తున్నావ్. కార్లలోనూ మేడల్లోనూ తిరుగుతున్నావ్. అదృష్ట వంతురాలవ్ కాదూ?''

"అవును సుభద్రా'' ప్రభాకరం అన్నాడు. ''నువ్వెందుకో ఊరికే ఆవేశ పడ్తున్నావ్ కానీ, రెండో పెళ్ళన్నమాటే కానీ చలపతికి మాత్రం ఏమంత వయసై పోయిందనీ?''

సుభద్ర మాట్లాడలేదు.

పెద్దవదిన కల్పించుకుంది. "అదికాదు లేండి, మా ఆడబిడ్డ బాధ, అదీ మీ కర్థం కాదూ.'' సాగదీస్తూ అనడంలో వెటకారం కూడా ఒక పాలు మిళాయించింది. "ముగ్గురు సవతి బిడ్డలున్నారే. వాళ్ళని పెంచిపోషించాలే, పెట్టుపోతలు జరపాలే అనీ ఆవిడ బాధ ...అంతగా నీకు ఇష్టం లేకపోతే, మీ ఆయన మాత్రం నీ మాట కాదంటాడేమిటో? వాళ్ళని ఏ వాళ్ళమ్మమ్మ గారింట్లోనో తీసికెళ్ళి పారేయమను. అక్కడే పెరుగుతారు. ఇక్కడ మీరు హాయిగా....''

"వదినా!'' ఆమె మాట పూర్తికాకుండానే సుభద్ర కోపంగా అసహనంగా అరచింది. "వాళ్ళు పరాయి పిల్లలే గనుక అలా మాట్లాడగలిగావు. అదే నీపిల్లలైతే అలాగంటావా? ఒకవేళ ఖర్మకాలి నువ్వే చచ్చిపోతే నీ పిల్లలు కూడా అలాగ అనాధలై అల్లల్లాడాలని కోరుకుంటావా నువ్వు?'' తీవ్రంగా ప్రశ్నించింది.

ఆ మాటలు వింటూనే ఆ వదిన ఆవే




శంతో ఎగిరి పడింది. "ఏవమ్మోయ్ మాటలు తిన్నగా రానియ్, ఏమిటి మహా మిడిసిపడుతున్నావ్?" అంటూ బిగ్గరగా అరచింది.

అంతలోనే అత్తవైపూ భర్తవైపూ చూస్తూ "చూశారా ఎంత మాటందో నన్ను? నేనుచావాలా, నా పిల్లలు అనాధ లవ్వాలా?"దుఃఖంతో జీరబోయింది ఆమె గొంతు."అంతగా అయితే నువ్వే చావు. నీ మొగుడి కింకొకతె వుంటుంది"అక్కసుతో శపించింది.

"నోర్మూయ్." కోపంగా మందలించాడు శంకరం భార్యను, "లోపలికి పో. అసలు మా మాటల్లో నిన్నెవడు కలుగజేసుకోమనాడు? మేమూ చెల్లాయ్ యేదో మాట్లాడుకుంటూంటే నీ కెందుకు మధ్యన?"

యేమేమో గొణుక్కుంటూ లోపలికి పోయింది శంకరం భార్య.

సుభద్ర ఆశ్చర్యానికి అవధులు లేక పోయాయి. అన్నలూ, వదినలూ ఏకమై తనను విసుక్కుని కసురుకొన్నరోజులూ, నానా మాటలూ అన్న సంఘటనలూ తనకు చాలా జ్ఞాపకం వున్నాయి. తల్లి చూస్తూ వూరుకొనేది. అటువంటి ఇంట్లో ఈనాడు అన్న తన తరఫున మాట్లాడి భార్యను తీవ్రంగా మందలించడం చాలా విడ్డూరంగా తోచింది సుభద్రకు. కాని అతడు యేదో పెద్ద పథకంలోనే వున్నాడని మాత్రం అన్పించింది.

—(సశేషం)

# పాతివ్రత్యం

మల్లంపల్లి కృష్ణారావు

మదనమంజరి అద్దంముందు కూర్చుని అలంకరించుకోసాగింది. అలంకరించుకోవడంకూడా గొప్ప కళే. అందలోనూ మంజరి వంటి అపురూప సౌందర్యవంతులకు అలంకరణ సాధారణంగా వుంటే అందం ముందు అలంకరణ

వెలవెలబోయే ప్రమాదం వుంది. పైగా వేశ్యావృత్తిలో జీవిస్తూన్నందువల్ల విటులకు నిత్యనూతనంగా పెంపొందే యౌవనవతిగా కనిపించాలంటే అలంకరణలో లోపం వుండకూడదు. అందుకే మంజరి అతి శ్రద్ధగా అలంకరించుకుంటుంది. కాశ్మీరం నుంచి ప్రత్యేకంగా కస్తూరి తెప్పించింది. వింధ్యారణ్యాలలో వేటాడి సంపాదించిన పున్నాగ పరిమళ ద్రవ్యాలకు మోజుపడి అధిక వెలతో వాటిని కొన్నది. ప్రఖ్యాతి వహించిన విశ్వబ్రాహ్మణుల చేత వజ్రవైఢూర్యాలతో, పగడాలతో, నీలాలతో, ముత్యాలతో ఎన్నో ఆభరణాలు చేయించింది. కంచీపురం, కాశ్మీరపురం, వరపురం పట్టు చీరలు తెప్పించింది. ముత్యాలభస్మంతో పారాణి చేయించింది. అంతేకాదు. తన చెలికత్తె సుభాషిణిని ఉజ్జయినీ విశ్వవిద్యాలయానికి పంపి అలంకరణ శాస్త్రంలో ప్రత్యేకశిక్షణ ఇప్పించింది.

"మరకతాలు పొదిగిన ఈ హంసల హారం ధరిస్తారా?" అనడిగింది సుభాషిణి.

"వద్దు. వజ్రాలహారమే బాగుంటుంది. ఈ నీలంరంగు కాశ్మీరపు చీరకు ఆ హారమే అందాన్నిస్తుంది" అంది మంజరి.

సుభాషిణి సిగ్గుపడుతూ నవ్వింది. అలంకరణ విషయంలో తను ఉజ్జయినీలో పొందిన శిక్షణకన్న మంజరికున్న అనుభవం, సూక్ష్మబుద్ధి అమోఘమైనవని తెలుసు.

"ఈ రోజు ఇంత ప్రత్యేకంగా అలంకరించుకొంటున్నారు। విషయం తెలుసుకోవచ్చా?" పాదాలకు పారాణి రాస్తూ అడిగింది సుభాషిణి.

"విదర్భదేశపు యువరాజు వచ్చారు. తిరిగి రేపు వారిదేశం వెళ్ళిపోతారుట. ఈరోజు వారి సమ్ముఖంలో నాట్యం చేయాలి," నవ్వుతూ సమాధానమిచ్చింది మంజరి.

మంజరి నవ్వులోని అంతర్భావం సుభాషిణికి అవగతమే. తిరిగి యువరాజు వెళ్ళేది ఒక పక్షం తర్వాతనే. మంజరి అందచందాల మహత్యం అలాంటిది.

"విదర్భ యువరాజు ఈ రాత్రికి మన భవనం వేంచేస్తారు. భవనం బాగా అలంకరించారా?" మంజరి అడిగింది.

"వేరే అలంకరించాలా, అమ్మా? మన భవనం ఎప్పుడూ నూతనమే? మీరే వచ్చి పరికించండి," అంది సుభాషిణి.

మంజరి అద్దంముందు నుంచి లేచి జరీ అంచుతోవున్న వంగ పండు రంగు కాశ్మీరపు శాలువా కప్పుకుంది. భవనాన్ని పరిశీలించడానికి బయలుదేరింది.

నాట్యప్రదేశాన్ని రంగు రంగుల ముగ్గులతో చూడ ముచ్చటగా తయారుచేశారు. గోడలమీద వివిధ నాట్యభంగిమలతో వున్న చిత్తరువుల్ని తగిలించారు. నాట్య ప్రదేశానికి వెనుకగా పాలరాయితో మలచిన నటరాజ విగ్రహం ముందు వాయిద్యాల నన్నిటినీ అర్ధ చంద్రా

కారంలో అమర్చారు. నాట్యప్రదేశానికి ఎదురుగా నెమలి ఆకారంలోవున్న సింహాసనాన్ని వుంచారు. ఆసనం ముందు పళ్లెంలో వివిధ ఫలాల్ని అమర్చారు.

శయనాగారంలో హంసతూలికాతల్పం పై మల్లిపూవులు చల్లారు. అగరు ధూపాన్ని వేశారు. అర్ధనగ్నంగా మలచ బడిన శిల్పాల్ని, చిత్తరవుల్ని అమర్చారు.

మంజరి ఆ ఏర్పాట్లుచూసి సంతృప్తి చెందింది. సుభాషిణితో, "యువరాజు శయనాగారంలో ప్రవేశించగానే మలయ మారుత రాగంలో మురళిని తగ్గుస్వరంలో ఆలాపించమని వాద్యగత్తెల్ని ఆదేశించు." అని చెప్పి పంపింది. ఇంతలో వీధిలో కలకలం వినిపించింది.

గవాక్షం దగ్గరకువెళ్ళి చూసింది మంజరి. తన భవనంముందు తన దర్శన భాగ్యంకోసం మూగిన జనం కనిపించారు. ఇది మామూలే. ఎవరో తను గవాక్షం దగ్గర వున్నట్లు గమనించారు కాబోలు చప్పట్లు చరుస్తూ తనని చూపించారు. మంజరి గర్వంగా నవ్వుకుంది. తన సౌందర్యమహిమ అలాంటిది. సాధారణ ప్రజానీకానికి దూరమైన సౌఖ్యాల్ని తాను ఎన్నో అనుభవిస్తూంది. ర్యాజాని కంతటికీ అధినేతలై ప్రజలను పాలించే ప్రభువులు సైతం తనకు దాసులే. యుద్ధంలో అపజయ మెరుగని పరాక్రమ వంతులు తన క్రీగంటి చూపులకు దాసోహ మని తమ సర్వస్వాన్ని తన పాదాల ముల వుంచారు. విదేశాలతో వాణిజ్యం జరిపే వర్తకశ్రేష్ఠులు తనకు అత్యంత విలువైన ఆభరణాలు కానుకలుగా సమర్పించుకున్నారు. కవీశ్వరులు కలలు కనే కవితావస్తువు తను. కళాకారుల మన సులు కరిగించి కళగా ప్రవహింపచేసే ఆ దేశం తను. దర్శనభాగ్యంతో తన్మయ మందే లక్షలాది ప్రజల ఆరాధ్య దైవం తను.

మందహాసంతో వారికి అంజలి ఘటిం చింది. ఇంతలో ఒక సౌందర్యరాశి తట్టలో ఒక కుష్ఠురోగిని కూర్చోబెట్టి నెత్తిమీద బెట్టుకుని నడుస్తూవస్తోంది. వీధిలో జనం చెల్లాచెదరై చీదరంతో ఆ స్త్రీని దూషిస్తున్నారు. ఆ కుష్ఠురోగిని ఈ వీధిగుండా తీసుకురావద్దు అని హెచ్చ రిస్తూ రాళ్ళు రువ్వుతున్నారు. ఆ స్త్రీ భారంగా అడుగులేస్తూ రాళ్ళు వేయవద్దనీ, తను తొందరగా వెళ్ళిపోతాననీ తిరిగి అటు రాననీ నచ్చచెపుతోంది. రాళ్ల తనపై విసరమనీ తట్టలోని రోగిపై వేయ వద్దనీ వారిని ప్రాధేయపడుతోంది.

మంజరి ఆశ్చర్యచకితయై సుభాషిణిని పిలిచి "ఆ కుష్ఠురోగి ఎవరు?" అని ప్రశ్నించింది.

సుభాషిని పరిశీలనగా కిటికీలోంచి చూసి "అతను తెలీదా, దేవీ! మొన్న మొన్నటివరకూ మీ పాదాలవద్ద దాసాను దాసుడిగా పడివుండిన కౌశికుడు. ఆస్తి అంతా హారతికర్పూరంలా కరిగి




పోయింది. పైగా భయంకరమైన కుష్ఠు వ్యాధి సంప్రాప్తించింది. ఇదీ అతని ఇప్పటిస్థితి'' అంది.

"కౌశికుడా! గుర్తుపట్టలేనంతగా మారిపోయాడే. అవును. ఆ రోగం అంత భయంకరమైనది. అయినా కౌశికుడికి అంత పెద్ద కూతురు వున్నదని నేను వినలేదే.''

''ఆమె అతని కూతురు కాదు, దేవీ. అతని భార్య. పేరు సుమతి. మహా పతివ్రత. నదీ స్నానం చేయించి యింటికి తీసుకు వెళ్తోంది'' అంది సుభాషిణి.

"అతని భార్యా!'' ఆశ్చర్యంగా అడిగింది మంజరి. కౌశికుడు మంజరికి బాగా తెలుసు. మంజరి సాన్నిహిత్యం కోసం అర్రులు చాచి నిత్యమూ తన సన్నిధానంలో పడివుంటూ ఆస్తినంతటినీ అర్పించుకున్నాడు. అతనిదగ్గర ఏమీలేదని తెలియగానే అతన్ని పంపి వేసింది. తిరిగి రావద్దని తను చెప్పినపుడు అతనెంత ప్రాధేయపడ్డాడో, తనని ఎంతగా ప్రేమిస్తున్నానని విన్నవించుకున్నాడో, ఎంత

దీనంగా తనని బతిమాలుకున్నాడో తనకి బాగా జ్ఞాపకంవుంది.

కానీ అతని కింత అందమైన భార్య వుందని తనకి తెలియదు. తన దగ్గరకు వచ్చేవాళ్ళందరికీ అందమైన భార్య లుండ రని కాదు. కాని ఈ సమాజంలో వేశ్యల్ని పోషించడం, అనుభవించడం ఒక ప్రతి ష్ఠగా భావించబడే విషయం. కానీ ఈ కౌశికుడు ఒక దేశానికి రాజు కాదు. యుద్ధంలో శత్రురాజ్యాల్ని కొల్లగొట్టి డబ్బు చేసుకునే వీరుడూకాదు. వ్యాపా రంలో లక్షలార్జించే వర్తక శ్రేష్ఠికాదు. అతని అంతస్థు వేశ్యల్ని పోషించేదికాదు. అయినా ఎందుకో అంత అందమైన భార్యని నిర్లక్ష్యం చేసి యీ దారుణ కామ ప్రవృత్తిలో అంత భయంకరమైన కుష్ఠ వ్యాధిని తెచ్చుకునేటంతగా మునిగి పోయాడు. మంజరి ఆశ్చర్యంలో మునిగి పోయింది.

సుమతి ఎంత గొప్పవ్యక్తి! ఇన్ని భోగ భాగ్యాలనుభవిస్తున్న తను దేశం లోని మహామహులను తన పాదాలదగ్గర మోకరింప చేయకల్గిన తను ఆమెలో వున్న విశిష్టతను ఎప్పుడూ ప్రకటింపలేక పోయింది. అంతటి భయంకరమైన రోగంతో అంతటి హీనస్థితిలోవున్న కౌశికుణ్ణి అంతగా ఆదరించటం తనకి సాధ్యమా? తనకేకాదు అటువంటి స్థితిలో వున్న ఏ వ్యక్తియొక్క భార్యకైనా అది సాధ్యమా? ఎంతటి దయార్ద్రహృదయం! కదలలేని స్థితిలోవున్న వ్యక్తిని, స్పృశించ డానికికూడ భయపడాల్సిన వ్యక్తిని తట్టలో మోసుకొని నదీ స్నానానికి తీసుకు వెళ్ళడం ఎంత గొప్ప విషయం! మంజ రికి, యీ దురదృష్టంలో తనకీ కొంత భాగం వున్నట్టు అనిపించింది. ఆ దంప తులకు ఏదైనా కొంత ధనరూపంలో సాయం చెయ్యగల్గడం ఒక్కటే విముక్తి మార్గంగా తోచింది.

* * *

సుమతి ఇంట్లోకి ప్రవేశించింది. కౌశికుణ్ణి మంచంమీద పడుకోబెట్టింది. కౌశికుడు బాధగా మూలిగాడు. అతని వంటినిండా వ్రణాలు. రక్తం కారు తున్నాయి. ఈగలు ముసురుతున్నాయి. అతని శరీరానికి మానవాకారం పూర్తిగా మాసిపోయింది. పోగుపడిన మాంసం ముద్దలా వున్నాడతను.

సుమతి నూనెతెచ్చి ఈగలు ముసర కుండా వంటినిండా రాసింది. తెల్లటి గుడ్డలు కాళ్ళకీ చేతులకీ కట్టింది. పాలు తెచ్చి నోటికందించి త్రాగించింది. విసన కర్రతో విసురుతూ విసురుతూ మంచం ప్రక్కనే కూర్చుంది.

"ఇక చాల్లే. నువ్వెళ్ళి నిద్రపో", అన్నాడు కౌశికుడు.

"ఫర్వాలేదు. మీరు నిద్రపోయేంత వఱకూ విసరనివ్వండి", అంది సుమతి.

కౌశికుడికి సుమతిని చూస్తే అసహనం, జాలి. తను భర్తగా ఆమెను ఏవిధం

గానూ సుఖపెట్టలేకపోయాడు. భార్యగా సామాన్య స్త్రీ పొందే ఎన్నో ఐహిక సౌఖ్యాలకు ఆమె దూరమైపోయింది. తను ఆరోగ్యంగా వున్న సమయంలో కూడ ఆమె తనవద్దనుండి ఏమీ పొంద లేకపోయింది. ఇప్పుడు తను చేసిన పాప కృత్యాలకు ఫలితంగా ఏర్పడిన ఈ దారిద్ర్యాన్ని, ఈ రోగాన్ని, ఈ శల్యావశిష్ట మైన వ్యక్తిత్వాన్ని ఆమె సేవించవలసి వస్తోంది. తనెప్పుడూ విసుక్కోదు. ఒక్క చిన్న మాటలోనైనా వ్యతిరేకించి ఎరుగదు. ఇది భరించలేని విషయంగా తోచింది కౌశికుడికి. ఆమె తన ఎదురుగా నిల్చుని తను చెప్పబోయే పనిచెయ్యడం కోసం ఆతృతగా ఎదురుచూడ్డం తనని, ఇంత హీనమైన రోగాన్ని సంతరించు కొన్న తనని, సేవించడంకోసం ఆరాట పడ్డం కౌశికుడికి అసహనాన్ని రేపు తున్నాయి. ఇంతకన్నా తనని అస హ్యించుకొని వదిలేస్తే కొంత మనశ్శాంతి పొందేవాడేమో. తన పాపకృత్యాన్ని నిరంతరం ఎత్తి చూపడానికి, తనెంత నీచుడో ప్రతిక్షణం జ్ఞాపకం చెయ్యడానికి నియోగింపబడ్డ వ్యక్తిగా ఆమె కన్పిస్తోంది.

"నువ్వు నా ఎదురుగా వుండటంకన్న పెద్ద బాధలేదు నాకు. ఇక్కణ్ణుంచి వెళ్ళిపో. ఇంకా నాలో ఏంగొప్ప విశేష ముందని యీ తాపత్రయం అంతా! భర్తగా వుండి నీకు చెయ్యాల్సినదాంట్లో పీసమైనా నిర్వర్తించలేక పోయానే! ఇంకా నా గురించి ఎందుకీ ఆరాటం?" అని బాధగా అరిచాడు కౌశికుడు.

సుమతి ఏం మాట్లాడలేదు. విసురుతూ కూర్చుంది. కౌశికుడికి ఆ విధంగా మాట్లాడటం అలవాటే.

"నేనీ రోగంతో ఇంకెన్నాళ్ళో బ్రతకను. ఇన్నాళ్ళూ నీకేవిధమైన సౌఖ్యమూ కలిగించలేక పోయాను. ఇప్పుడైనా నన్నొదిలి వెళ్ళిపో. నా చివరి క్షణాల్లోనైనా ఓ మంచిపని చేశాననే ఆనందం మిగులుతుంది నాకు. నీకింకా ఎంతో జీవితం ముందు వుంది." అన్నాడు కౌశికుడు.

సుమతి విసురుతూనే సమాధాన మిచ్చింది: "మీరు లేకుండా నేనొక్కర్తినీ జీవించటం అసంభవం. మీరు నాకేదీ చేయలేకపోయానన్నారు. నాకు తెల్సినంత వరకూ నా మెళ్ళో మూడు ముళ్ళూ వెయ్యడంకన్న చెయ్యాల్సిన మహోపకారం నాకు వుండదు. మీరు నా భర్త. నా దైవం. నాకున్న ఇహానికీ, పరానికీ మీరే ఆలంబనం. మీరు యీ లోకంలో ఎలాంటి వ్యక్తులైనా, ఏ విధంగా పరిగణింపబడినా, మీరెటువంటి వారైనా, ఎటువంటి పనులుచేసినా నా కర్తవ్యం తరం ఉండకూడదు. మీ వ్యక్తిత్వాన్ని పూజించడం, మీలో దైవాన్ని దర్శించడం నాకు నిర్దేశింపబడిన మార్గం. భారత స్త్రీగా ఇంతకుమించిన పుణ్యాన్ని నేను కోరు

కోవడం లేదు. మీరు నన్ను దూరం చెయ్యకండి. మీ సుఖమే నా సుఖం."

కౌశికుడిలో కోపం రేగిపోయింది. "శ్రీరంగనీతులు వల్లించగలవు. నువ్వు నాకు దూరంగా వుండటమే నాకు సుఖం. నా సుఖాన్ని కోరుకొన్న దానివైతే తక్షణం ఇక్కణ్ణుంచి వెళ్ళిపో", అన్నాడు.

సుమతి మళ్ళా మౌనంగా వూరుకుంది.

కౌశికుడు మళ్ళీ అన్నాడు: "నీదెంత అజ్ఞానం, సుమతీ! నా అంత క్షుద్రుడూ, నీచుడూ అయిన వ్యక్తి మరొకడు వుండడు. నాకు సేవ చెయ్యడమా? ఇంత అవసానదశలో వుంటూ చావబోతున్న నాకు యింకా తీవ్రంగా రగుల్తున్న కోర్కెను వింటే నువ్వు క్షమించగలవా? భార్యగాకాదు, స్త్రీగా!"

సుమతి తలెత్తిచూసింది. "ఏమిటది?"

"చెప్పను. చెప్పడానికే సిగ్గుగావుంది. చాలా క్షుద్రమైన కోరిక. నా కోరిక ఏమిటో నీకు చెప్పకపోయినా, అదెంత క్షుద్రమైనదో ఆలోచించు. నేనే నీస్థితిలో వుంటే నన్ను క్షమించి ఉండేవాణ్ణికాదు."

"చెప్పండి, ఏమిటది? నాకు సాధ్యమైనంతవరకూ ఆ కోరిక తీర్చడానికి ప్రయత్నిస్తాను. దయవుంచి నాకా అవకాశం ఇప్పించండి." సుమతి ప్రాధేయపడింది.

"చెప్పనా? చెపుతాను. నేను చెప్పిన తర్వాతైనా నా మీద అసహ్యంతో నువ్వు నన్నొదిలి పోవడానికి అవకాశం వుంది. చెపుతున్నా విను. నేను చనిపోయే లోపుగా ఒక్కసారి, ఒకే ఒక్కసారి ఆ మదనమంజరిని అనుభవించాలని వుంది."

సుమతి చప్పున లేచింది. "మీ కోరిక నెరవేర్చడానికి అనుమతి ఇవ్వండి. ఇప్పుడే వెళ్తున్నాను." అంటూ కౌశికుని పాదాలకు నమస్కరించి, బయటకు నడిచింది. కౌశికుడు "సుమతీ! సుమతీ!" అని అరుస్తున్నా వినిపించుకోకుండా.

* * *

మదనమంజరి నాట్యశాలలో కూర్చుని వాద్య గత్రంతో నాట్య ప్రదర్శనలో వాయించవలసిన వాద్యాల గురించి, శ్రుతి గురించి, గీతాల గురించి చర్చిస్తోంది. ఆదేశాలిస్తోంది.

ఇంతలో సుభాషిణి వచ్చి, "దేవీ! మీకోసం కౌశికుని భార్య సుమతి వచ్చింది. ప్రవేశ పెట్టమంటారా? పంపివేయమంటారా?" అని అడిగింది.

మంజరి దిగ్గున లేచి, "సుమతి? ప్రొద్దున్న మనం వీధిలో చూసిన వ్యక్తి?" అనడిగింది.

"అవునమ్మా! ఆ వ్యక్తే." సుభాషిణి సమాధాన మిచ్చింది.

"వెంటనే మా ఆంతరంగిక మందిరంలో ప్రవేశపెట్టు." అంది మంజరి.

"సరే! కానీ, విదర్భ యువరాజు




వచ్చేవేళ అయింది,'' అంది సుభాషిణి.

''పర్వాలేదు. ఆయన్ని కూర్చోబెట్టి చిత్తరువులు చూపిస్తూండు. సుమితీదేవిని వెంటనే మా ఆంతరంగిక మందిరానికి తీసుకురా,'' అంటూ ఆంతరంగిక మందిరానికి దారి తీసింది మంజరి.

సుమతి రాకలోని అంతరార్థం బోధపడలేదు మంజరికి. పైగా, ఒక పతివ్రత తనలాంటి వేశ్యల గృహాల్లోకి ప్రవేశించడమా? ఇంతకు ముందే ఆమెకు ఏదైనా సాయం చేదామని తను అనుకున్న విషయం జ్ఞాపకానికి వచ్చింది. ఏదైనా సహాయం కోరి రాలేదుకదా?

కౌశికుడు నిరుపేదగా మారినంత వఱకూ అతన్ని ఆశ్రయించి, ఆ తర్వాత తృణీకరించిన మంజరికి అంతటి భయంకరమైన రోగంతోవున్న కౌశికునికి సుమతి సేవ చెయ్యగల్గడం ఒకవిధమైన కనువిప్పుగా తోచింది. అంతటి ఔదార్యాన్నింతవఱకూ తానెఱుగదు. తనకన్నా సుమతి అధికురాలనడానికి రుజువేం కావాలి? సుమతి పట్ల ఎనలేని గౌరవం ఏర్పడింది మంజరికి. ఆంతరంగిక మందిరంలో సుమతి కోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

సుభాషిణి సుమతిని వెంటనే తీసుకు వచ్చింది.

మంజరి సుమతికి ఎదురుగా వెళ్ళి, సాదరంగా ఆహ్వానించి, ఆసనం మీద కూర్చోబెట్టింది.

"మీరు రావడం ఒక అమోఘమైన విషయం. నేనే ఇంతకుముందు మీ దర్శనం చెయ్యాలనుకుంటున్నాను. మీరే వచ్చారు. మీకు నేను చేయగలిగిం దేమైనా వుంటే చెప్పండి."

సుమతి తడబడింది. మంజరి తనని ఎరిగున్నట్లుగా పలకరిస్తోంది. ఇంతకు ముందు ఎప్పుడూ కలుసుకోలేదు. "క్షమిం చాలి. మీరు నేనెవరి ననుకుంటున్నారో? నన్ను సుమతి అంటారు."

మంజరి చిరునవ్వు నవ్వింది. "నాకు తెలుసు, దేవీ! మీరు కౌశిక మహా శయుని భార్యా మణి అని నాకు తెలుసు, నేను మిమ్మల్ని చూశాను. నావల్ల మీకు కాగల పనేమిటో శెలవియ్యండి."

సుమతి సుభాషిణి వంక చూపింది. మంజరి సుభాషిణితో వెళ్ళి పొమ్మన్నట్టుగా సంజ్ఞ చేసింది. సుభాషిణి బయటకు నడి చింది.

"ఇంతకుముందు మీరే నన్ను కలుసు కోవాలనుకున్నట్టు చెప్పారు. కారణం తెలుసుకోవచ్చా?" అనడిగింది సుమతి.

"మీమీదున్న గౌరవ భావంతో, దేవీ! ప్రొద్దున్న మీరు కౌశికుని తట్టలో మోసుకు వెళ్తుండడం చూశాను. ఎంతటి మాన వత్వం, ఔదార్యంవుంటే అంతటి సేవా భావం కలుగుతుంది?" అంది మంజరి.

"క్షమించాలి. ఇందులో మానవత్వం ఔదార్యం ఉండాల్సిన అవసరం నాకు కన్పించడం లేదు. ఆయన నా భర్త, ఆయనకి సేవ చెయ్యడమే నా కర్తవ్యం"

మంజరి నవ్వింది. "లోకంలో అందరు భార్యలూ అలాగే ప్రవర్తిస్తు న్నారా, దేవీ? ఎంతమంది తమ భర్తల్ని నిర్లక్ష్యం చేయడంలేదు?"

"నేను పతివ్రతను. పతిని సేవించి ఆరాధించటమే నా వ్రతం."

"నేను అంగీకరిస్తాను. యోగ్యుడూ, ప్రయోజకుడూ అయిన భర్తని సేవించడం భార్యకి కర్తవ్యం కావచ్చు. కాని కుష్ఠు రోగినీ, నిరుపేదనూ, భర్తగా తన బాధ్యతల్ని ఏమాత్రం నిర్వర్తించలేని వాడినీ సేవించడం పాతివ్రత్యంకాదు. మానవత్వం! మీరు భార్యగా సేవచేయడం లేదు. ఒక మనిషిగా చేస్తున్నారు."

"నాభర్త ఎటువంటి వాడైనా కావచ్చు. ఎటువంటి స్థితిలోనైనా ఉండొచ్చు. కానీ ఆయన్ని సేవించడం నాకు నిర్దేశింపబడిన మార్గం. విధి."

మంజరి ఆశ్చర్యంగా చూపింది.

"అయితే మీరు కౌశికునికి సేవలు చెయ్యడం మీ కర్తవ్య నిర్వహణ కోసమా? లేక మానవత్వంతోనా?"

"కర్తవ్య నిర్వహ,ణే" సుమతి దృఢంగా అంది.

"మీరు కౌశికుని ప్రేమిస్తున్నారా? ప్రేమించగలరా?" మంజరి అడిగింది.

సుమతి నవ్వింది.

"మీరు అర్థం లేకుండా అడుగుతున్నారు. నా భర్తని నేను ప్రేమించకుండా ఉంటానా?"

"మీ భర్తగా కాదు. ఒక మనిషిగా."

"నాకు ఇంకేమీ తెలీదు. నాకు తెలిసినది ఒకటే విషయం. ఆయన నన్ను అగ్నిసాక్షిగా వివాహమాడారు. ఆయన కోసం నా జీవితాన్ని అంకితం చేయడం నా బాధ్యత."

"పోనీ యీ విషయం చెప్పండి. కౌశికుడు కాదు. మరో వ్యక్తి వేశ్యాగృహాలలో తిరుగుతూ, ఆస్తిని హరింపజేస్తూ, భార్యని నిర్లక్ష్యం చేస్తూ, ఆఖరికి కుష్ఠువ్యాధిని తెచ్చుకొన్న మరో వ్యక్తిని మీరు ప్రేమించగలరా?"

"నేను నా భర్తని తప్ప ఇంకో వ్యక్తిని గురించి ఆలోచించను."

"పోనీ. మరో స్త్రీ అటువంటి వ్యక్తిని ప్రేమించగలదా?"

"అది నాకనవసరమయిన విషయం."

"మీకు ప్రేమంటే ఏమిటో తెలియదు. జీర్ణించుకు పోయిన సాంప్రదాయం మిమ్మల్ని ప్రేమకు దూరం చేసింది. మీరు మీ భర్తని ప్రేమించటంలేదు. అది నిశ్చయం."

సుమతి మాట్లాడలేదు.

'ఇంకొకటి అడుగుతాను చెప్పండి. మీరు మీ భర్తని ఎప్పుడయినా మందలించారా?"

"నా భర్తని నేను మందలించడమా? మీరు అర్థంలేని ప్రశ్నలు అడుగుతున్నారు. ఆయన్ని మందలించాల్సిన అవసరం నాకు కలగలేదు. కలగదు. ఆయనకు నచ్చిన రీతిలో నేను ప్రవర్తించి ఆయనకు సేవ చెయ్యడమే నా బాధ్యత."

"ఎందుకు?" మంజరి అడిగింది.

"ఎందుకేమిటి? భారత స్త్రీకి మోక్ష సాధన భర్తని సేవించడంలోనే వుంది."

మంజరి తీక్షణంగా చూసింది.

"మిమ్మల్ని ఎందుకు గౌరవించాలో అర్థం కావడంలేదు. మీ భర్త దుర్మార్గుడని మీకు తెలిసివుండాలి. చెడు మార్గాలంటే ఏమిటో, మానవ లోకంలో ఉన్నారు కాబట్టి, మీకు అర్థం అయి ఉంటుంది. మీ భర్త చెడుపనులు చేస్తున్నాడని తెలిసికూడ మీరు మందలించలేదంటే అర్థం ఏమిటి? మీకు ప్రేమంటే ఏమిటో తెలిసుంటే, మీరు మీ భర్తని ప్రేమించి వుంటే, ఆయన్ని తప్పక మందలించి వుండేవారు. మీరు ఆయన్ని మందలించలేదు సరిగదా ఆయన చేసే ప్రతి పనినీ, అడ్డగించకపోవడం, పరోక్షంగా ప్రోత్సహించడమే. అయితే ఆయన చేసే ప్రతి చెడుపనిలోనూ మీకు భాగం ఉన్నదన్న మాట. భార్యగా ఆయన్ని సన్మార్గంలో పెట్టడం గొప్ప విషయమా? లేక ఆయన్ని ఇష్టంవచ్చిన రీతిలో సంచరించ నివ్వడం, పైగా ఆయనకి కించిత్తయినా కోపం తెప్పించకుండా సేవలు చెయ్యడం,

గొప్ప విషయమా? ఏది భార్యగా మీ ధర్మం?"

సుమతి మాట్లాడలేదు.

"మీరు మొదట్లో అయన్ని మందలించి వుంటే ఆయన యీ స్థితికి దిగజారి ఉండే వాడు కాడు. ఆయన చేసే ప్రతిపనికీ మీరు కిమ్మనకుండా కూర్చుంటే ఆయన చెడుపనులు చేస్తే మాత్రం తప్పేమిటి? భార్యగా మీకుండే హక్కులేమీ పొంద లేకపోయారు సరికదా ఆయన తన బాధ్య తలు నిర్వర్తించకుండా వ్యసనాలలోనూ చెడు మార్గాలలోనూ జారిపోయే ప్రమా దాన్ని కల్పించారు. ఆయన సౌఖ్యాన్నీ ఉన్నతినీ మీరు కాంక్షించి ఉంటే ఆయన్ని అదుపులో పెట్టి వుండేవారు."

"ఆయన ప్రవర్తనని నిరోధించటం నా ధర్మం కాదు. ఆయన్ని అనుసరించ డమే నా ధర్మం. భార్య భర్తని అదుపులో పెట్టడం ఏమిటో నా కర్థం కావటం లేదు. అది అసహజం. పైగా భార్య చెపితే భర్త వినాలని ఎక్కడ వుంది?"

"వినకపోతే ఆయన ఖర్మ. సంసా రంలో ఎవరు తప్పు త్రోవ తొక్కినా ఇద్దరూ ఫలితాన్ననుభవిస్తారు. అందుచేత ఒకళ్ళ నొకళ్ళు సరిదిద్దుకునే అవసరం ఎప్పుడూవుంది. మీరు చెప్పినా ఆయన వినకపోతే అందులో మీ తప్పు లేదు. ఇంత నీచంగా, క్షుద్రంగా వేశ్యాలాలసలో పడి దరిద్రుడయి కుష్ఠు రోగాన్ని తెచ్చు కొన్నవ్యక్తిని మానవత్వం విషయంవది లేయండి, భార్యగా మీ రెందుకు గౌరవిం చాలి? బాధ్యతల్ని విస్మరించి యింత దౌర్భాగ్య స్థితిలోకి దిగజారిన వ్యక్తిని మీరు నిర్లక్ష్యం చేసినా తప్పేమిటి? మీకో జీవితంవుంది. అది అనుభవించే హక్కు, బాధ్యత మీవి. ఇంకొక నీచుడి కోసం దాన్ని బలిపెట్టడం దేనికి?"

సుమతి చటుక్కున చెవులు మూసు కుంది.

"శివ శివా! మీరు దయవుంచి అటు వంటి మాటలు మాట్లాడకండి. నా భర్తని దూషించడం నేను సహించలేను."

మంజరి చీత్కారంగా అంది: "నేను మిమ్మల్ని గౌరవించాను. మీ భర్తని గౌర వించలేదు. ఇప్పుడు మిమ్మల్ని గూడ గౌరవించటం లేదు. ఇంతవరకూ కౌశికుడు ఎంతటి ధూర్తుడో అనుకున్నాను. కాని అతన్ని ధూర్తుణ్ణిచేసింది మీరు. మిమ్మల్ని అసహ్యించుకోవాలి."

సుమతి ఏం మాట్లాడలేదు.

"ఇందాక అన్నారు. 'భారత స్త్రీకి భర్తని సేవించడంలోనే మోక్షసాధన వుంది అని. మీ రెంతటి నీచులో ఇంకా వేరే చెప్పాలా?మీరు మీ భర్తని ప్రేమించ లేదు. భార్యగా అతన్ని సముదాయించి, మంచి మార్గంలో పెట్టే ప్రయత్నంచేయ లేదు. అతను క్షుద్రమార్గాన్ని అనుసరించ డానికి పరోక్షంగా సాయం చేశారు. ఇప్పుడు కుష్ఠురోగంతో స్పృశించడానికి కూడ భయపడే వ్యక్తికి మీరు సేవలు




చేస్తున్నారు. ఎందుకు? మీ స్వార్ధం. మోక్షసాధనకోసం మీరు పొందే ఆరాటం. అతన్ని భర్తగా మీరు చూడట్లేదు. మీ మోక్షసాధన కోసం పనికి వచ్చే పనిముట్టుగా మాత్రమే! ఇదెక్కడి పాతివ్రత్యమో అర్ధంకావటంలేదు."

"పతివ్రతల్ని మన శాస్త్రాలు, సమాజం, సంప్రదాయాలు ఎప్పుడూ గౌరవిస్తూనే వున్నాయి. మీరు కాదన్నంత మాత్రాన పాతివ్రత్యపు విలువ తగ్గదు." అంది శాంతంగా సుమతి.

"మీరు అనుసరిస్తున్నది పాతివ్రత్యమే అయితే అటువంటి పాతివ్రత్యాన్ని పాతేయడానికి ఎన్ని శాస్త్రాలు, సమాజాలు, సాంప్రదాయాలు అడ్డొచ్చినా నాకు భయంలేదు. నేను వేశ్యను. సాంసారిక సౌఖ్యాలు నాకు కరువయ్యాయని నేను బాధపడతాను. భార్యాభర్తల మధ్య ప్రేమ ఎలావుంటుందో నాకు తెలీదు. కానీ భార్యగా కర్తవ్యాలన్నిటిగమ్యం మోక్షసాధనే అయితే, అటువంటి భార్యాత్వం కన్న యీ వేశ్యావృత్తి మేలు. ఇంతవరకూ మీరు నాకన్నా గొప్పవాళ్ళని అనుకున్నాను. ఇప్పుడు చెపుతున్నాను. మీకన్నా అధములుండరు.మీకన్నా నేను లక్షరెట్లు అధికురాల్ని!" మంజరి ఆవేశంతో

అరిచింది. "మీతో మాట్లాడ్డానికి నాకు సహనం పోతోంది! మీరెందుకొచ్చారు?"

"అవసాన దశలో నా భర్త ఒక్క కోరిక కోరాడు. అందుకు మీ సహాయం కావాలి."

"ఏమిటది?" అంది మంజరి విసుగ్గా.

సుమతి తలవంచుకునే అంది "చని పోయే ముందు నా భర్తకి ఒక్కసారి మిమ్మల్ని అనుభవించాలని ఉందిట. మీ అనుమతికోసం వచ్చాను. మిమ్మల్ని బ్రతిమాలుకుంటున్నాను."

మంజరి ఛీత్కారంతో బిగ్గరగా అరి చింది: "ఛీ! పాపీ! నువ్వు తక్షణం యిక్కడ నుంచి వెళ్ళిపో. లేకపోతే గెంటిస్తాను."

సుమతి మెల్లగా లేచి వెళ్ళిపోయింది.

మంజరి బ్రాన్పడిపోయింది. ఎంత దారుణమయిన కోరిక! ఒక కుష్ఠురోగిని అనుభవించనిమ్మని అడగడానికివచ్చిందా? సాటి స్త్రీగా అయినా ఆలోచించలేక పోయిందా? ఇదేమి పాతివ్రత్యం? ఇటు వంటి క్షుద్రురాల్ని క్షమించవచ్చా?

మంజరికి సుమతిపై అసహ్యం కలి గింది. వడి వడిగా వెళ్ళి సుమతిని చప్పట్లు చరిచి పిలిచింది. సుమతి ఆతృతగా వచ్చింది.

"నీచురాలా! నీ మోక్షసాధన నిన్ని దౌర్భాగ్యస్థితికి తీసుకు వచ్చిందా? భర్తల్ని వేశ్యా గృహాలకి భార్యలే పంపించడం పాతివ్రత్యం కాబోలు. తీసుకురా అతన్ని! అతని కోరిక చెల్లిస్తాను. అందువల్ల నా కారోగం సంప్రాప్తమై, ఇందరిచే ఆరా ధింపబడిన నా సౌందర్యం నాశనమై అతి హేయమైన కుష్ఠురోగపు వికారాన్ని వైక ల్యాన్ని సంతరించుకొన్నా సరే. నా వృత్తినీ, యీ భోగభాగ్యాల్నీ, సంఘంలో నా గౌరవాన్నీ వదులుకోవాలన్నా సరే నేను సిద్ధమే. కాని యిందుకు బదులుగా నిన్నూ నీ మూఢ పాతివ్రత్యాన్నీ అవమా నించే అవకాశం నాకుంటే చాలు. ఎల్లాంటి అవమానమో తెలుసా? రోజూ నువ్వు నా యింట్లో దాసీగా సపర్యలు చేయాలి. నే నెవర్ని? క్షుద్రమైన వేశ్యను. నువ్వు? పాతివ్రత్యంతో మోక్షాన్ని సాధించుకో బోయే స్త్రీవి. నువ్వు నా యింట్లో దాసీగా ప్రవర్తించాలి. తెలిసిందా? దేశంలోని పతివ్రతల నందరినీ ఈవిధంగా అవమా నించే మహద్భాగ్యం దక్కితే ఆ కుష్ఠు రోగేకాదు యింకా ఎవ్వరైనా వుంటే తీసుకురా. నా కభ్యంతరం లేదు. నా అందం, యవ్వనం, ప్రతిష్ఠ, ఈ భోగ భాగ్యాలుపోయినా ఫర్వాలేదు. వెళ్లు! కానీ తెలుసుకో! పతివ్రత అనే పదం కంటె నీచమైనది మరొకటి లేదు." అని అరిచింది.

సుమతి ఆనందంతో, ఆతృతతో మంజరికి నమస్కరించి వడివడిగా వెళ్ళి పోయింది.



# అనుకొన్నదొకటి....

తాళ్లూరు నాగేశ్వరరావు

జీవితంలో ఏ క్షణంలో ఏం జరుగుతుందో తెలీదు. హెచ్చరిక లేకుండానే ఎన్నో సంఘటనలు సంభవిస్తూఉంటాయి. ఆ కోవకు చెందినవే గవర్నమెంటు సర్వీసులో ట్రాన్సఫర్లు కూడాను. ఒక యాక్సిడెండు జరిగినట్టుగా నరసింహారావుకు హఠాత్తుగా ఏలూరునుంచి తెనాలికి ట్రాన్సఫరు వొచ్చింది.

ఆరోజు పదీ ఇరవైతొమ్మిది నిముషాలకు ఆఫీసులో తన సీట్లో కూర్చుని, జేబురుమాలుతో మొహానికి పట్టిన చిరుచెమటను తుడుచుకొంటూ ఉండగా ప్యూను ఆ వర్తమానపు లేఖను పువ్వుల్లో పెట్టి అందించాడు. చతువుకొంటూ ఉండగానే శరీరపు ఉష్ణమాపకంలో ఒక్కుమ్మడిగా నూటఆరు డిగ్రీలు పెరిగాయి. వెంటనే

ఓ బడాగ్లాసు మంచినీళ్లు పట్టించి, నివురు గప్పిన నిప్పులా నిట్టూర్చాడు నరసింహారావు. తనకి ట్రాన్స్‌ఫర్ వొచ్చినట్టు ఎవ్వరితోనూ చెప్పుకోలేదు. ఆ ట్రాన్స్‌ఫర్‌ను ఆపుదల చేయించడానికి ఏరాజకీయ నాయకుణ్ణీ సాష్టాంగపడి ఆశ్రయించలేదు. జరిగిందంతా తన మంచికే అనుకొని వారం రోజుల్లోనే తెనాలికి మకాం మార్చాడు.

నాజర్‌పేటలో ఓ ఇల్లు అద్దెకు తీసుకొన్నాడు. చవుగ్గా దొరికింది. సంతోష పడ్డాడు. అతని భార్య శశిరేఖ అమితంగా సంబర పడింది. అరవై రూపాయలకు ఆరుగురు పిల్లలుగల సంసారం నివసించేంత విశాలమైన లోగిలి దొరికింది. కాని నరసింహారావు కుటుంబం. ఎర్రత్రికోణం లాంటిదే. ఇంకా కావాల్సిందేముంది?

ముందు ప్రహరీ డ్రాయింగ్ రూమ్ తర్వాత హాలు. బెడ్‌రూమ్, స్టోర్‌రూమ్, కిచన్. దేవునిగదీ, మరో చిన్న పడక గదీ, వెనుక బోలెడంత ఖాళీస్థలం. పెరటి దొడ్లో పిచ్చిమొక్కలు మస్తుగాఉన్నాయి. పంపుకాకుండా ఓ వరలబావి కూడా ఉంది. అన్నింటికీ మించి ఇల్లు బజారు తల. కాని ఒక దృష్టిలో చూస్తే ఆ ఇల్లు నరసింహారావుకు నచ్చలేదు. వెనుక భాగాన చాడు వేసిన మొండిగోడ ఉంది. ఆ గోడ అవతల లేబర్ గుడిసెలు ఉన్నాయి. ఆ గుడిసెల్లో ఉండే పనీ పాట జనం నుంచి ప్రొద్దస్తమానమూ సందడి మందంగా వినబడుతూనే ఉంటుంది. వాతావరణమే పరువు తక్కువగా ఉంది. కాని శశిరేఖ సరిపెట్టుకొంది. "వాళ్లెవరో, మన మెవరమో! మన ఇంట్లో మనం గుట్టు చక్కగా ఉంటే, ఇరుగూ పొరుగూ వాళ్ళతో మన కేంపని?'' అన్నదామె. నిజమే అనుకొన్నాడు నరసింహారావు.

ఓ నెల గడిచింది.

భార్యాభర్త లిద్దరూ ఓ ప్రణాళికను రూపొందించుకొని, దాని ప్రకారం ఆ ఇంటిని చక్కగా దిద్ది తీర్చారు. పదిహేను రూపాయలు కూలిఇచ్చి, ఇద్దరు మనుషుల్ని పెట్టి - పెరటి దొడ్డినంతా బాగు చేయించారు. నరసింహారావు ఆఫీసుకు వెళ్ళిన టైంలో, పిల్లలిద్దరూ స్కూలుకు వెళ్ళాక, ఆ తీరుబడి కాలంలో—శశిరేఖ స్వయంగా దగ్గరుండి, పెరటిదొడ్డిని అందంగా, ఆరోగ్యవంతంగా తయారు చేయించింది. అందులో పూలమొక్కలు నాటించింది; కూరగాయ పాదులు పెట్టించింది; ఆకుమళ్లు వేయించింది; వాటికి తగిన నీటి సరఫరా వసతులు సమకూర్చింది. పెరటి తోటల పెంపకమంటే ఆమెకు పిచ్చి సరదా ఆమె సరదాను నరసింహారావుకూడా సమర్థించడం కద్దు.

నెలా పదిహేను రోజుల్లో పూల మొక్కలూ, కూరగాయల చెట్లూ, ఆకుమళ్లూ ఏపుగా ఎదిగి వచ్చాయి. చూడ ముచ్చటగా తయారైనాయి. రోజుకు పది సార్లు వాటిని చూసుకొంటూ శశిరేఖ మురిసిపోసాగింది.




సాయంత్రపు వేళల్లో భార్యాభర్త లిద్దరూ ఆ పెరటితోట చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేయసాగారు. పిల్లలు బయట ఆడుకోడానికి వెళ్ళేవారు.

"చూడండి! తోటకూర మడి ఎంత ఇంపుగా పెరిగిందో! నాలుగాకులు గిల్లి రేపు పప్పులో పెడతాను." అన్నది శశి రేఖ ఆ సాయంత్రపు చల్లదనంలో.

"సెభాష్! నీకృషి ఫలితాన్ని రేపు రుచి చూపించబోతున్నావన్నమాట!" అన్నాడు నరసింహారావు పెదవులు దాటని దరహాసంతో.

శశిరేఖ శరీరం గర్వంతో గరిపొడిచింది.

"పెరటితోటల పెంపకం మన ఆర్థిక వ్యవస్థకు ఎంతో చేయూతనిస్తుంది. ఈ రహస్యాన్ని చాలమంది గ్రహించక పోవడం, పెరటిదొడ్లను బందులదొడ్లలా వాదిలేయడం మన దేశపు దురదృష్టం" అన్నాడు నరసింహారావు. పదేళ్ళ క్రితం చదివిన అర్థశాస్త్రాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

అవునన్నట్టు తల ఆడించింది శశిరేఖ. ఆమెకు అర్థశాస్త్రజ్ఞానం అట్టేలేదు. పొట్ల పాదు దగ్గర నిలబడి, పిందెల్ని పరిశీలిస్తోంది. నరసింహారావు నిమ్మపాదులోని కలుపు మొక్కల్ని ఏరివేయ సాగాడు.

ఆరోజు రాత్రి పడుకొన్న తర్వాత కూడా ఆ దంపతుల సంభాషణ కొంత

సేపు పెరటితోటపై కొనసాగింది. రేపు ఉదయం వండబోయే తోటకూర పప్పును గురించి ఆమె ప్రస్తావించగా, అందులోకి అప్పడాలు ఉన్నాయా? లేవా? అని అతను ప్రశ్నించాడు. మలబార్ మసాళా అప్పడాలున్నాయని ఆమె సమాధానం చెప్పింది. నరసింహారావు నాలుకపై నీళ్లు నిలిచాయి.

మరునాడు ఉదయం మూడు బార్ల ప్రొద్దెక్కేసరికి శశిరేఖ భర్తకు కాఫీ ఇచ్చి, పిల్లలకు బౌర్న్‌విటా ఇచ్చి, ఓ చిన్న ప్లాస్టిక్ సంచి పట్టుకొని పెరటితోటదగ్గరకు వచ్చింది—తోటకూర కోయడానికి. తోటకూర మడిని చూడగానే ఆమె ప్రాణాలు కడబట్టాయి. గావుకేక పెట్టింది. అప్పుడే ఓ ఎర్ర కోడి మొండిగోడ దూకి పారిపోయింది.

వరండాలో కూర్చొని తాపీగా దినపత్రిక చూస్తోన్న నరసింరాహోవు భార్య కేకకు ఉలిక్కిపడి, పేపరు వొదిలేసి ఆదరాబాదరా పరుగెత్తుకొచ్చాడు. భార్యామణి ఏ పాముపిల్లను చూసి దడుచుకొందో నని అతని భయం.

"శశీ! శశీ! ఏం జరిగింది?" అన్నాడు నరసింహారావు గొంతులోకి వాచ్చిన గుండెను సర్దుకొంటూ.

మాట్లాడలేని నిశ్చేష్టతలో ఆమె తోటకూర మడికేసి వ్రేలు చూపెట్టింది.

తోటకూర మడంతా పాడైఉంది. అక్కడక్కడా ఆకులు కొరికి ఉన్నాయి; మొక్కలు పెళ్ళగించి ఉన్నాయి. నిన్నటిదినాన నవనవలాడుతూన్న మడి, తెల్లవారేసరికి ఈడుబోయిన బీడులా ఉంది. నరసింహారావు నోటమాట లేక రెండు నిముషాలు నిలబడ్డాడు.

"ఆ ముదనష్టపుకోడి పనే ఇదంతా?" అన్నది శశిరేఖ కనుకొలకుల్లో నీళ్ళు నిండగా.

"ఎవరిదా కోడి?" అన్నాడు నరసింహారావు క్రోధోన్మత్తుడై.

"లేబరువాళ్ళది." అన్నది శశిరేఖ మొండిగోడకేసి చూస్తూ.

వెంటనే నరసింహారావు మొండిగోడ దగ్గరకు వెళ్ళాడు. కోడి కనబడలేదు. గుడిసెల ముందు పిల్లలు ఆడుకొంటున్నారు. ఒకడు సైకిలు రిక్షాను మసిగుడ్డతో తుడుస్తున్నాడు. ఇంకొకడు ఎండలో రికామీగా కూర్చొని ఎంగిలిబీడీ కాలుస్తున్నాడు. మరొకడు పాత దినపత్రికను శ్రద్ధగా చదువుతున్నాడు. ఒక ఇల్లాలు రోడ్డుకు అడ్డంగా చతికెలబడి, రెండుకాళ్ళూ బార్లా సాచి, ఒడిలో పసిపిల్లను పెట్టుకొని పాలు ఇస్తూన్నది. ఒక ముసలావిడ రోడ్డు దుమ్ముతో ఇత్తడి తపేళా తోముతూంది. ఇంకో ఆవిడ చేటలో బియ్యం పోసుకొని, మట్టిగడ్డలు ఏరివేస్తూ, కిరాణా కొట్టువాణ్ణి దుమ్మెత్తిపోస్తోంది.

"ఏఁయ్!" అన్నాడు నరసింహారావు మొండిగోడ ఇవతలవుండి. అతని ప్రక్కనే శశిరేఖ నిలబడింది.

అందరి తలలూ ఆ కేకకేసి మళ్లాయి.

"మా దొడ్లోకి ఓ కోడివచ్చి, తోట కూర మడినంతా ధ్వంసం చేసింది. ఎవరిదా కోడి?" అన్నాడు నరసింహారావు క్రొత్తగా ప్రమోషనైన ఆఫీసరు అధికార ధోరణిలో.

పాత దినపత్రిక చదువుతూన్న కార్మిక నాయకుడూ, రిక్షా తుడిచేవాడూ, ఎంగిలి బీడీ కాలుస్తూన్నవాడూ, పిల్లలూ, ఆడంగులూ అందరూ మూక ఉమ్మడిగా మొండి గోడదగ్గరకు వచ్చారు. శశిరేఖకు భయమేసింది.

"కోడికేం తెల్సు బాబూ! కళ్లులేనిది" అన్నాడు కార్మికనాయకుడు దినపత్రికను మడుస్తూ.

"మీకున్నాయిగా కళ్లు, అలా బలాదూరుగా వొదలేయడమేనా? మా తోటకెంత నష్టం కలిగించిందీ!" అన్నాడు నరసింహారావు.

"తప్పైపోనాది బాబులూ! ఇకనుంచీ రానీయంలే. చమించండి" అన్నాడు రిక్షావాడు. వాడిదే కోడి.

"ఈతడవ వస్తే కోడిని కైమాగా వండిస్తా" ఓ మోతాదు తూలాడు నరసింహారావు.

"బూర్జువా మాటలు మాటాడకండి. పేదవాళ్ళం అంత చేతులు చచ్చి లేరు. కోడిని కైమాచేస్తే, కోర్టు కెక్కించి, జైలు కూడు తినిపిస్తాం, జాగ్రత్త! శ్రామిక వర్గం మీదా మీ దౌర్జన్యం!" అన్నాడు కార్మిక నాయకుడు రుద్రుడై.

శశిరేఖకు తత్తర పుట్టింది. భర్త చేయి పట్టుకుని ఇంట్లోకి లాక్కెళ్ళింది.

ఆ రోజు గడిచింది. ఆ సాయంత్రం వరకూ మళ్ళీ ఆ కోడి ఆ చాయలకు రాలేదు.

మరునాడు ప్రొద్దున్నే వచ్చి— ఆకుమడుల మీద దాడి చేసింది. శశిరేఖ వాపోయింది. నరసింహారావు మళ్ళీ గుడిసెల వారిమీద దండెత్తాడు. ఆ సమయంలో కార్మిక నాయకుడు లేడు. రిక్షా వాడు మళ్ళీ 'చమించండి బాబులూ' అన్నాడు. నరసింహారావు బెదిరించాడు. కాని తాటాకు చప్పుళ్ళకు తల వొంచే దెవరు?

ఆ విధంగా రోజూ డ్యూటీ ప్రకారం తెల్లవారేసరికి కోడి రావడమూ, ఆకుమడులను పాడుచేయడమూ, శశిరేఖ నుదురు బాదుకోవడమూ నరసింహారావు నోరు చించుకోవడమూ, రిక్షావాడు క్షమాపణలు చెప్పుకోవడమూ, యిరుగు పొరుగు వాళ్లు కాలక్షేపంగా ఆ దృశ్యాన్ని తిలకించడమూ అలా అలా ఓ వారం రోజులు భాగవతం నడిచింది.

శశిరేఖ బెంబేలు పడసాగింది.

నరసింహారావుకు నరాలు పట్టు సడలినాయి. ఏం చేయాలో అంతు పట్టడం లేదు. ఆ కోడి పెద్ద సమస్యగా తయారైంది.

భార్యాభర్త లిద్దరూ ఓ రోజు రాత్రి ఆలోచనచేశారు. ఇద్దరూ ఓ నిర్ణయానికి

వచ్చారు. ఆ నిర్ణయం ప్రకారం ఆ కోడిని కొందామనుకున్నారు. కాని ఏం చేయాలో కూడా ముందుగా ఆలోచించుకొన్నారు. ఆ మరునాడే మొండిగోడ దగ్గరకు దంపతు లిద్దరూ వెళ్ళి రిక్షావాణ్ణి పిల్చారు. తెచ్చికోలు వినయంతో దణ్ణాలు పెడుతూ వచ్చాడు రిక్షావాడు.

"కోడిని అమ్ముతావా?" సూటి గా ప్రశ్నించాడు నరసింహారావు.

కుడీ, ఎడమా చూసి తల ఆడించాడు రిక్షావాడు.

"ఎంత?"

"ఎంతో నండా బాబుగారూ!.... ఓ పది రూపాయలు!"

"పది రూపాయలే!" అన్నది శశిరేఖ ఆశ్చర్యాశ్చర్యంతో.

"మరేనండే! రెండు కిలోల మాంసం అవలీలగా అవుతాదండి. అల్వాలాంటి మాంసమండీ. ఒక్కసారి తింటే మరి వొదల్రండీ!" అన్నాడు రిక్షావాడు లొట్టలు వేసుకొంటూ.

దంపతులిద్దరూ 'శ్రీహరీ' అనుకుంటూ చెవులు మూసుకున్నారు.

బేరం చేసి చివరకు తొమ్మిది రూపాయలకు ఆ కోడిని కొన్నారు. కాలికి ఓ తాడు కట్టి చెట్టుకు కట్టేశారు.

ఆ మరునాడు నరసింహారావు పై ఆఫీసర్ని ఇంటికి భోజనానికి పిల్చాడు. పై ఆఫీసరు నాయుడు అక్షరాలా నాన్‌వెజిటేరియన్. కాని నరసింహారావూ, ఆయన భార్యా యిద్దరూ విశిష్ట శాఖాహారులు. అంచాత నరసింహారావు ప్యూనును పిలిపించి, ఆ కోడిని అప్పగించి, మంచిగా కూర వండుకురమ్మనమని ఆజ్ఞాపించాడు.

కాని ఆ మర్నాడు నాయుడు నరసింహారావు ఇంటికి భోజనానికి రాలేదు. హఠాత్తుగా ఆయనకు కడుపులో నొప్పి వచ్చిందట అందుచేత రాలేనని కబురు చేశాడు. కాని కోడికూర మటుకు మషాళాకు అంటే మషాళాతో తయారై వచ్చింది. నరసింహారావు నిరాశతో క్రుంగిపోయాడు. ఆ కూరను చట్టితోపాటుగా ప్యూను కిచ్చివేసింది శశిరేఖ. తన పంట పడిందను కొంటూ ఆ ప్యూను పరమానందంతో ఇంటికి వెళ్ళాడు.

కోడి బెడద తప్పింది. పెరటి దొడ్లోని ఆకుమడులు మళ్ళీ పుంజుకొంటున్నాయి. ఏపుగా పెరగసాగాయి. శశిరేఖ సంతోష పడసాగింది

సరిగ్గా వారం రోజుల తర్వాత ఓ ఉదయం మళ్ళీ ఆకుల్ని కోడి కెలకడం చూసి శశిరేఖ నిర్విణ్ణురాలైంది. గావుకేక బెట్టి భర్తను పిలిచింది. ఆ దృశ్యాన్ని నరసింహారావు కూడా చూశాడు. అతని మనస్సు కూ ముల్లు గుచ్చుకున్నట్లయింది. నిశ్శబ్దంగా భార్య కేసి చూశాడు.

"మళ్ళీ ఆ రిక్షావాడు ఇంకో కోడిని కొని మన తోటపైకి ఉసిగొల్పాడు." అన్నది శశిరేఖ.

నరసింహారావులో ఉక్రోషం ఉవ్వె






త్తున లేచింది. గబగబా మొండిగోడ దగ్గరకు వెళ్ళాడు. అతని వెంటే భార్యామణి కూడా నడిచింది. రిక్షావాణ్ణి పిలిచాడు. రిక్షావాడూ, అతని వెంట కార్మిక నాయకుడూ, మరి ఇద్దరూ వచ్చారు. శశిరేఖ భయపడింది.

"మళ్ళీ కోడిని కొన్నావా?" అన్నాడు నరసింహారావు రిక్షావాణ్ణి ఉద్దేశించి.

వాడు అమాయకంగా తల ఆడించాడు.

"ఇవాళ మా దొడ్లోపడి ఆకుమడిని నాశనం చేసింది." అన్నాడు నరసింహారావు గొంతు పెద్దది చేస్తూ.

'అయితే నన్నేం చేయమంటారు?' అన్నట్టు చూశాడు రిక్షావాడు.

"నీ కోడి మళ్ళీ మా దొడ్లోకి వచ్చిందంటే వూరుకోను. జాగ్రత్త! న్యూసెన్సు కేసు పెట్టి, కోర్టు చుట్టూ తిప్పుతాను." అన్నాడు నరసింహారావు.

"కేసు పెట్టండి బాబూ....; బీదా బిక్కీ అంటే అంత లోకువా? ధనిక స్వాముల దౌర్జన్యాన్ని ప్రతిఘటించడానికి మేమంతా ఒకటై పోరాటం సాగిస్తాం. మేం కోళ్ళను పెట్టుకు జీవిస్తాం. అవి నోరులేని పక్షులు. ఎక్కడ తిరగాలో, ఎక్కడ తిరక్కూడదో వాటికేం తెల్సు? మీ తోటకోసం మా జీవనాధారాన్ని వొదులుకోమంటారా?" అన్నాడు కార్మిక నాయకుడు ఉపన్యాస ధోరణిలో.

"దాన్ని జాగ్రత్తగా కట్టివేయండి" అన్నాడు నరసింహారావు.

"అది కుక్క కాదు కట్టివేయడానికి" అన్నాడు కార్మిక నాయకుడు నిర్లక్ష్యంగా.

నరసింహారావుకు నడినెత్తి మండింది. కాని ఏం చేయలేక, గిరుక్కున వెనక్కు తిరిగి ఇంట్లోకి వెళ్ళాడు. భార్యామణి అతన్ని అనుసరించింది.

ఆ రోజంతా భార్యా భర్తలు కోడిని గురించి తీవ్రంగా ఆలోచించారు. ఆ సాయంత్రమే నరసింహారావు ఓప్లీడరుతో సంప్రదించాడు: న్యూసెన్సు కేసు బెట్టి ఈ బెడదను వొదిలించుకోడానికి అవకాశా లేమైనాఉన్నాయేమోనని. కాని ఆ ప్లీడరు సలహా నరసింహారావుకు నచ్చలేదు. కేసు పెట్టడం వృధా అని ఆయన సలహా సారాంశం.

రిక్షావాని కోడి రోజూ ప్రొద్దున్నే క్రమం తప్పకుండా నరసింహారావు పెరటి దొడ్డిని పావనం చేస్తూనే ఉంది. భార్యా భర్త లిద్దరూ ఆలోచనలమీద ఆలోచనలు చేస్తూనే ఉన్నారు. రెండు మూడు సార్లు శశిరేఖ రాయి పుచ్చుకుని ఆ కోడివెంట బడింది ఆమె విసిరిన రాయి దానికి తగ ల్లేదు.కోడి తప్పించుకొంది. అయినా అది రావటంమానలేదు.

ఒకరోజు నరసింహారావు ఇంటి ఓనర్ దగ్గరకు వెళ్ళాడు. కోడి కథ సవిస్తరంగా చెప్పాడు. తన అదుర్దానూ, ఆవేదననూ, పెరటితోట మీద తను పెట్టిన్న పెట్టు బడినీ, తన భార్యకు ఆ తోటపై ఉన్న మోజునూ,మమకారాన్నీ తెలియజెప్పాడు. పాపం, ఇంటి ఓనరు నోటితో సానుభూతి చెప్పాడుగానీ—తను కార్యరూపంలో చేయగల సహాయమేమీ లేదని స్పష్ట పరి చాడు.

"ఆ మొండిగోడను పడగొట్టించి, దానిస్థానే పక్కాగోడ కట్టించండి" అర్థించాడు నరసింహారావు.

"నా దగ్గర డబ్బులేదు. మీరు కట్టించి, అద్దెలో తగ్గించుకొంటే నాకభ్యంతరం లేదు." అన్నాడు ఇంటి ఓనరు.

కొంతమేరకు సంతృప్తిపడ్డాడు నర సింహారావు. ఆ ప్రణాళికను గురించి భార్యకు చెప్పాడు. తోట రక్షణకోసం ఆమె అదుర్దా కనబరుస్తోంది కాబట్టి ఇట్టే ఒప్పేసుకుంది.

ఆ మరునాడే నరసింహారావు ఇటుకా, సున్నానికి ఆర్డరు ఇచ్చాడు. నలుగురు కూలీల్ని పిలిపించి కందకాలు త్రవ్విం చాడు. తాపీమేస్త్రీని పిల్చి వారంరోజుల్లో గోడ అయిపోవాలన్నాడు.

"వారం దేనికండీ! డబ్బు ఆజీలుగా వుంటే మూడ్రోజుల్లో ముగించేయనూ!" అన్నాడు మేస్త్రీ మస్తాన్.

సున్నం, రాయీ, ఇసుకా, కూలీలూ అంతా సిద్ధం. మూడు రోజులకే గోడ




సగం లేచింది. నరసింహారావు ఆ గోడ కట్టుబడికి సెలవైతే పెట్టలేదుగానీ, శశిరేఖ దగ్గరుండి కట్టించసాగింది. ఉదయమూ, సాయంత్రమూ నరసింహారావు దగ్గరే ఉంటున్నాడు.

ఆ రోజు సాయంత్రం నాలుగున్నర గంటలకు నరసింహారావు అగమేఘాల మీద ఆఫీసు నుంచి ఇంటికొచ్చాడు. వచ్చీ రావడంతో నేరుగా పెరటి దొడ్లోకి వెళ్ళాడు. జామచెట్టు దగ్గరుండే, "గోడ ఆపండి" అంటూ గావు కేక బెట్టాడు.

మూల మట్టంతో ఇటుకరాయి లెవల్ చూస్తోన్న మేస్త్రీమస్తానూ, సున్నం ఇసుకా కలుపుతూన్న కూలీలూ, గోడదగ్గర నిలబడ్డ శశిరేఖా ఆశ్చర్యంతో మొహాలెత్తి చూశారు.

"ఏమిటి? ఏం జరిగిందండీ!" అన్నది శశిరేఖ ఆశ్చర్యంతో కనుబొమలు వెడల్పు చేసి.

"కొంపమునిగింది. ఇక్కణ్ణుంచి రాజమండ్రికి ట్రాన్సఫరైంది. బిచాణా ఎత్తివేయాలి వారం రోజుల్లోపల" అన్నాడు నరసింహారావు. గొంతులో దుఃఖాన్ని జవజవలాడిస్తూ.



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"పోట్లాట అంటూ వస్తే ఎప్పుడో వచ్చేది మీకు. నాకు తెలుసు. మీరు అమ్మతో ఎప్పుడూ పోట్లాడరు. రెండు చేతులూ కలిస్తేగానీ మోతరాదు."

నాన్నగారు నవ్వారు.

అంతలోనే గంభీరంగా అవుతూ అన్నారు.

"లాభం లేదు. నీతో వాదనకి దిగితే నేనే ఓడిపోతాను. మీ అమ్మకి తెలియకుండా నువ్వు నిమ్మలూరు వెళ్ళటం అసంభవం. కాబట్టి ఆ వూహే మానుకో."

ఆయన మళ్ళీ పేపరు చేతుల్లోకి తీసుకున్నారు.

"మమ్మీకి తెలియకుండా నేను ఉపాయం చెబుతాను కదండీ!" అన్నాను.

"ఏమిటది?"

"ఎల్లుండి మీరు మద్రాస్ వెళ్తున్నారా లేదా?"

"వెళ్తున్నాను."

"నేనూ మీతో వస్తాను."

"వచ్చి?"

"అక్కడ నన్ను రైలెక్కించండి. బెజవాడ వెళతాను. అక్కడనుంచి నేను ఒంటరిగా సరాసరి నిమ్మలూరు వెళ్ళిపోగలను. పెళ్ళి అయిపోగానే నేను తిరిగి మద్రాస్ వచ్చేస్తాను. అక్కడనుంచి యిద్దరం వచ్చేద్దాం. అప్పుడు నేను నిమ్మలూరు వెళ్ళి వచ్చినట్టు ఎవరికి తెలుస్తుంది?"

నాన్నగారి కళ్ళలో ప్రశంసలాటిది కనిపించింది.

"మంచి ఆలోచనే! సరే! నాతో

మెద్రాస్ వస్తానని మొదట మీ అమ్మని అడుగు. ఆవిడ ఒప్పుకుంటే అప్పుడు చూద్దాం.''

''ఉహూ. నేను అడగను. నేను అడిగితే మొదటే చెడుతుంది. మీరే అడగండి.''

''మళ్ళీ నా తలకే తెస్తున్నావూ?''

''యిది ఆఖరిసారి. ఇంకెప్పుడూ మిమ్మల్ని దేనికీ బాధపెట్టను. ఏదీ కావాలని అడగను. నాన్నగారూ!'' తటుక్కున మెరపులాటి ఆలోచన వచ్చినట్టుగా పిలిచాను. ఏమిటన్నట్టు చూశారు.

''సారధి సాయంత్రం భోజనానికి వస్తున్నాడు. అతనుండగా అడగండి. అమ్మ కాదనదు.'' అన్నాను కంఠం తగ్గించి రహస్యం చెబుతున్నట్టుగా.

నాన్నగారు బుద్ధిమంతుడైన చిన్న పిల్లాడిలా తల వూపారు.

రాత్రి అయింది.

సారధి భోజనానికి వచ్చాడు.

మమ్మీ మాతోపాటు కూర్చోలేదు.

తాయారమ్మ అందిస్తుంటే మాకు వడ్డిస్తోంది.

అలవాటు చొప్పున సారధికి కొసరి కొసరి వడ్డించి బలవంతంగా తినిపిస్తోంది. నాన్నగారు, సారధి లోకాభిరామాయణంగా, రాజకీయాల్లోకి దిగారు. పొలిటిక్స్ సంగతి ఎత్తితే నాన్నగార్కి ఇక మరోధ్యాస వుండదనే సంగతి నాకు బాగా తెలుసు.

దాదాపు మా భోజనాలు అయిపోవస్తున్నాయి.

నాన్నగారిధోరణి చూస్తే, అసలు నేను చెప్పిన సంగతి పూర్తిగా మర్చిపోయినట్టుగా వుంది.

నేను మాటిమాటికీ ఆయన వైపే చూడడం ప్రారంభించాను.

కానీ ప్రయత్నం పూర్తిగా వ్యర్థమైంది.

ఆయనసలు నా వైపు చూడనే చూడటంలేదు.

నాకు ఒళ్ళు మండింది.

ఏడుపు వచ్చినంత పనైంది కూడా!

కానీ ఏం చెయ్యటం?

యిక లాభంలేదని అనిపించింది.

అమ్మ పెరుగుగిన్నె కోసం లోపలకు వెళ్ళినప్పుడు, ''నాన్నగారూ! యిటు చూడండి. యిదేమిటో చెప్పండి.'' అంటూ అన్నంలో ''మెద్రాస్'' అనే అక్షరాలు వ్రాశాను.

నాన్నగారితోపాటు సారధికూడా నేను వ్రాస్తున్నవైపు చూశాడు.

నాన్నగార్కి వెంటనే గుర్తుకు వచ్చినట్టులేదు. అర్థంగానట్టు చూస్తూ ''ఏమిటది?'' అన్నారు.

''మెద్రాస్!'' కుతూహలంగా చూస్తున్న సారధి తను కనిపెట్టేసినట్టుగా అనేశాడు.

''మెద్రాసా? ఓ! అవును కదూ! మెద్రాస్! నేను మర్చిపోయాను.''




# విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాపహాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం : జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయచ్చు.

ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది :

1. 

బయట-చర్మం మీద

2. 

లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది, హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా : విక్స్ వేపొరబ్ మందు ఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందు ఆవిరి వంట్లో ప్రవేశించి, ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

### ప్రత్యేక గమనిక

బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




516C A

## విక్స్ వేపొరబ్ - జలుబుబాధలకి ఆధునిక ఔషధం

అన్నారు నాన్న.

నేను కన్నార్పకుండా ఆయన వైపు చూశాను.

ఆయన గుర్తు వచ్చినట్లు తలూపారు

సారధి మా యిద్దరి ధోరణి ఏమిటో బొత్తిగా అంతుపట్టని వాడిలా విచిత్రంగా నా వైపు, నాన్నగారి వైపు మార్చి మార్చి చూడసాగాడు.

"మెడ్రాస్ ఏమిటి?" అంది అమ్మ పెరుగు తెచ్చి మాకు వడ్డిస్తూ.

నాన్నగారు తలగోక్కున్నారు.

ఒకసారి నా వైపు చూసి పెరుగు కలుపుకుంటూ, "మీనా నాతో ఎల్లుండి మెడ్రాస్ వస్తుందిట. నేను వద్దంటుంటే వినటంలేదు." అన్నారు.

ఆయన అడిగిన ఆ తీరు నాకు చాలా ఆశాంభంగం కలిగించింది. ఒళ్ళు మండి పోయింది.

నా పోరు పడలేక మొక్కుబడి తీర్చు కోటానికి, ముక్కున పెట్టుకుని అప్ప చెప్పినట్లుగా వున్నాయి ఆ మాటలు.

నాన్నగారి ధోరణి చూస్తే అసలు నేను నిమ్మలూరు వెళ్ళడం అనేది ఆయనకే యిష్టం లేనట్టు అనిపించింది.

అమ్మ నా వైపు తిరిగి "అవునా?" అంది.

నేను భయపడుతున్నట్లు కళ్ళు రెప రెప లాడించి చూశాను.

తర్వాత అన్నం కెలుకుతూ, చిన్న గొంతుకతో, ఎంతో భయభక్తు లున్న దానిలా "అవును మమ్మీ. ఇక్కడ చాలా బోర్‌గా వుంది. రెండు రోజులు అలా తిరిగివస్తే—" ఆపైన ఎలా ముగించాలో తెలియక మింగేసినట్టు కావాలని మాటలు మింగేశాను.

అమ్మ ఏమనుకుందో ఏమో!

నా వైపు ప్రేమగా చూసింది. "దానికేం భాగ్యం!" అంది.

సారధి వైపు తిరిగి "మీ కూడా వీలుంటుందా? వీలుంటే యిద్దరూ సరదాగా వెళ్ళి రండి. అక్కడి నుంచి తిరుపతి వెళ్ళి దర్శనం చేసుకు రావచ్చు. అందరూ పెళ్ళి అయిన తర్వాత వెళితే మీరు ముందే వెడుదురుగాని" అంది నవ్వుతూ.

నేను గతుక్కుమన్నాను!

సారధా! మాతోనా!

అతను నా వైపు చూశాడు.

నా గుండెల్లో రాయిపడ్డట్టు అయింది.

సారధి మాతో రావటం, నేను నిమ్మలూరు వెళ్ళాలనుకున్న క్షణాలు తప్పని సరిగా అతనితో కలిసి తిరగటం, ఏడుపు ముఖంతో వుసూరుమంటూ హైదరాబాద్ తిరిగిరావటం, యివన్నీ చకచకా సినిమాలో రీలులా నా కళ్ళముందు తిరిగినాయి.

నా వైపు చూసిన సారధి అన్నం కలుపుకుంటూ, "ఉహూం. నాకు వీలుకాదు. యింకెప్పుడైనా వీలుంటే చూస్తాను." అన్నాడు.

అమ్మయ్య!

నా గుండెలమీద నుంచి పెద్ద బరువు దింపినట్టయింది.

అమ్మ సగం నిష్ఠూరంగా, సగం నవ్వుతూ అంది.

"చూశారా! ఎంతయినా ఆ తండ్రీ కూతుళ్ళు యిద్దరూ ఒకటి. ఎవరయినా తల్లితో ముందర చెప్పి తండ్రిని అడగమంటారు. మాది అంతా వ్యతిరేకం." అంది. ఆవిడ మాటల్లో ఏదో నిస్పృహాయత్వం, వంటరితనం ప్రతిధ్వనించాయి. సారధి అమ్మవైపు సానుభూతిగా, అర్థం చేసుకుంటున్నట్టుగా చూశాడు. నిజానికి మమ్మీ అతని దగ్గర కోరుకుంటున్నది అదేనేమో అనిపించింది నాకు.

భోజనాలు అయిం తర్వాత—

అమ్మ వక్కపొడి యిచ్చి సారధికి, నాన్నగార్కి యివ్వమంది.

టైమ్ అవటంతో నాన్నగారు రకు వెళ్ళారు.

వక్కపొడి యివ్వటానికి వెళ్ళాను.

అందించిన బరణిలోనుంచి ొడి తీసుకోబోతున్న అతను ఆగి,

నసం థ్యాంక్స్ అయినా చెప్పకూడదా కు?" అన్నాడు.

ఆ కంఠంలో చాలా నిష్టూరత్వం, ఆశాభంగం ప్రతిధ్వనింప చేయాలని అతను చేస్తున్న ప్రయత్నం నాకు తెలుస్తూనే వుంది.

"థ్యాంక్సా? ఎందుకు?" నేను తెల్లబోయినట్టు తలెత్తి చూస్తూ అడిగాను.

"నీతో మెడ్రాస్ రాకుండా మానేసినందుకు."

నేను పట్టుబడ్డ దానిలా చూసాను.

అతను నవ్వుతూ అన్నాడు.

"అవును మరి. నా వుద్దేశ్యాలేమిటో తెలుసుకోవాలనే ప్రయత్నం నువ్వు ఎలాగూ చేయటంలేదు. కనీసం నేనయినా నీ మనసు ఏమిటో గ్రహించుకోబోతే ఎలా?"

"ఏమిటది?" యింతలో అక్కడికి వచ్చిన అమ్మ యదాలాపంగా అడిగింది.

"ఏం లేదు. నేను తనతో మెడ్రాస్ రానంటున్నానని మీనాకి కోపం వచ్చింది" అన్నాడు వక్కపొడి తీసుకుంటూ.

"పోనీ వెళ్ళకూడదూ!" అమ్మ మరోసారి అడుగుతున్నట్టుగా అంది.

"ఉహూ. వీలుకాదు. సారీ మీనా. ఏమనుకోవద్దు. నామీద కోపం పెట్టుకోకుండా హాయిగా తిరిగిరా!" అన్నాడు.

అమ్మ నావైపు. అతని వైపు ఆనందంగా. సంతృప్తిగా చూసింది.

ఎందుకంటే. సారధి అలా అమ్మా, నాన్నగార్ల ముందు డైరెక్ట్‌గా నాతో మాట్లాడడం యిదే మొదటిసారి.

నాకు సారధిని చూస్తే అమ్మ దొంగా! అనిపించింది.

అయితే అతనిపట్ల నా విముఖత్వం కనిపెట్టేసా డన్నమాట!

కానీ నన్ను గెలుచుకోవాలని, తనని

"రాజూ మీ చెల్లాయే కాదు, నా అత్తయ్య కూతురు కూడా. అందుకే వచ్చాను."

ఆ విధంగా ఏవేవో ఆలోచన్లు రూపు తెచ్చుకుని కళ్ళ ముందు కదులుతూ వుండడంతో అసలు నిద్రే పట్టలేదు.

అసలు మామూలుగా అయితే తెల్లవారేసరికి బెజవాడ చేరుకోవాల్సిన ఎక్స్‌ప్రెస్! ఈ రోజు నేను ఎక్కానని దానికి తెలుసు కాబోలు! ఏ పనిలోనైనా ఆలస్యం అంటే నాకు మహా చిరాకు అని కూడా దానికి తెలుసునేమో! నన్ను ఏడిపించి, ఆటపట్టిస్తున్నట్టుగా, తీరుబడిగా, నెమ్మదిగా, నాలుగున్నర గంటలు ఆలస్యంగా చేరింది.

రాత్రంతా నిద్ర లేకపోవటంతో, ప్రయాణం అనుకున్నదానికంటే ఆలస్యం అవటంతో నాకు బడలికగా అనిపించసాగింది.

రైలు ప్లాట్‌ఫారమ్ మీదికి వచ్చి ఆగీఆగగానే యిద్దరు ముగ్గురు కూలీలు, 'కూలీ!' అని అరుస్తూ లోపలకు చొరబడ్డారు. అప్పటికే చాలా ఆలస్యం అయిపోయిందని చిరాకు పడుతూ, విసుక్కుంటున్న కొంతమంది వాళ్ళని చూడగానే 'మాది. మాది తీసుకో' అంటూ సామాన్లు అందించేసారు.

కొంచెం లోపలగా వుండిపోయిన నాకు యింకెవరినైనా చూడాల్సిన అవసరం ఏర్పడింది. ఇంకో యిద్దరు ఆడవాళ్ళు కూడా నాతోపాటు కూలీ కోసం చూస్తూ నిలబడ్డారు.

ఎండగా అనిపించడంతో నేను బాగ్‌లోనుంచి కూలింగ్ గ్లాసెస్ తీసి పెట్టుకున్నాను. కిటికీలో నుంచి వంగి దూరంగా పోతున్న ఒక రైల్వే కూలీని 'ఏయ్ కూలీ' అని పిల్చాను.

వాడికి నా మాట వినిపించ లేదులా వుంది.

వెనక్కి తిరిగి చూడకుండా అలే పోయాడు.

అంతా రణగొణ ధ్వని! ఒకటే జనం!

"ఏయ్! కూలీ! కూలీ" చప్పట్లు చరుస్తూ పిల్చాను.

"యస్. మేడమ్!'? వెనకనుంచి వినిపించింది.

నా కెంతో సుపరిచితం అయిన ఆ స్వరం వినగానే వులిక్కిపడ్డట్టయిన నేను తిరిగి చూసాను.

వెంటనే నా కళ్ళు పత్తికాయల్లా అయినాయి.

నా ఎదురుగా కృష్ణ నిలబడివున్నాడు! ఇద్దరం క్షణంసేపు ఒకళ్ళని ఒకళ్ళు చూస్తున్నట్లుగా నిలబడిపోయాం.

"నువ్వా!" అన్నాను నమ్మలేనట్టుగా చూస్తూ.

"జీహుజూర్!" తమాషాగా తల వంచి అభివాదం చేసినట్టు చేసాడు.

"నేను. నేను వస్తున్నట్టు నీ కెలా తెలిసింది?" విస్మయంగా అడిగాను.

"నిన్న రాత్రి కల వచ్చింది."

"తమాషా చేయకు. నిజం చెప్పు."

"తమరు దిగండి ముందు" పై బెర్త్ మీద వున్న సూట్ కేసు అందుకుంటూ అన్నాడు.

"ఎక్కడివాడివినువ్వు? తలుచుకుంటే తల క్రింద వున్నట్టు ప్రత్యక్షం అవుతున్నావు" అన్నాను నిష్ఠూరంగా.

"నిజంగా? నాకు తెలియదు సుమా!" అన్నాడు చిరునవ్వుతో.

ఆ నవ్వులో కొంటెతనం నా గుండెలు స్పందించేలా చేసింది.

ఇద్దరం దిగాం.

"స్పైసె నువ్వు పట్టుకోవటం ఎందుకు? కూలీని పిలు" అన్నాను.

"చిత్తం! తమరు యివ్వదల్చుకున్న కూలీ ఏదో నాకే యివ్వండి. పేదవాడిని."

"ఉహూ! చాలాహుషారుగా వున్నావే యీ వేళ?"

"ఒప్పుకుంటున్నాను," అన్నాడు.

అతనితో కలిసి, ఆ సందడిలో, ఆ ప్లాట్ ఫారంమీద అలా చకచకా నడుస్తూ వెళ్ళడం నాకు సరదాగా, ఆనందంగా, తియ్యటి అనుభవంలా అనిపించ సాగింది.

అతను యింత అరమరికలులేకుండా, చనువుగా, ఆత్మీయంగా మాట్లాడగా చూడటం యిదే మొదటిసారి నాకు.

ఇద్దరం ప్లాట్ ఫారమ్ దాటివస్తుండగా మరోసారి అడిగాను.

"నిజం చెప్పు. నేను వస్తున్నట్టు నీకెలా తెలిసింది? నువ్వు యింకెవరి కోసమో వస్తే నేను కన్పించాను. అవునా?" అన్నాను.

"ఏం కాదు. అక్షరాలా నీ కోసమే వచ్చాను. ఎప్పుడూ లేదు. కేవలం నన్ను ఏడిపించటానికే అన్నట్టుగా యీ రోజు రైలు యిన్ని గంటలు ఆలస్యంగా వచ్చింది. నిరీక్షణ అనేది యింత బాధగా, యింత అద్భుతంగా వుంటుందని నాకింత వరకూ తెలియదు."

అతని మాటల్లో నిరీక్షణ అనే పదం నాకు గూఢార్థంగా తోచింది.

అతని వైపు చూసాను

అతనూ నా వైపు చూసాడు.

ఇద్దరి పెదవులమీదా చిరునవ్వు కదిలింది.

నేను వెంటనే మూతి ముడిచేసుకుంటూ అన్నాను.

"ప్చ్! ఛో! నువ్వు వచ్చేసి నా బంగారు కలకాస్తా నాశనం చేసేశావు!"

"ఏమిటీ?" కృష్ణ ఆశ్చర్యంగా నా వైపు తిరిగాడు.

"నేను హఠాత్తుగా కన్పించాలని, మిమ్మల్నందరినీ ఆశ్చర్యంలో ముంచి లేపాలని ఎన్నెన్నో అనుకుంటూవచ్చాను. అన్ని ఆలోచన్లు వేస్ట్! కృష్ణార్పణం!"

"నేను కూడా సరిగ్గా యిదే అనుకున్నాను. స్టేషన్ కి వస్తున్నానని నీకు తెలియదు కదా! నన్ను చూసి తెల్లబోతావనుకున్నాను. నేను ఓపిగ్గా యిక్కడ

నిలబడి ఎదురు చూసిన యీ గంటలన్నీ కామార్పణం!"

"ఇదుగో! నన్ను ఎక్కిరిస్తున్నావా?" చిరుకోపంగా అన్నాను.

అప్పటికే నడుస్తూ, నడుస్తూ ఆగిపోయిన మా యిద్దరినీ చుట్టుపక్కల వాళ్ళు ఆసక్తిగా, వినోదంగా చూడ సాగారు.

యిది గమనించిన కృష్ణ, నా మోచేతి మీద అంటీ అంటనట్టు తాకుతూ, "నీకు పుణ్యం వుంటుంది. ఇక్కడ మాత్రం పోట్లాట పెట్టుకోకు. పద," అంటూ నడక సాగించాడు.

"నేను వస్తున్నట్టు ఎలా తెలిసిందో చెప్పవా నువ్వు?" బ్రతిమలాడుతున్నట్టుగా అడిగాను.

"మామయ్య టెలిగ్రాం యిచ్చారు."

"ఏమిటీ?" మళ్ళీ అతని వైపు తిరగబోయాను.

అతను నా చేయి పట్టి మామూలుగా తిప్పేసాడు.

"అవును. లేకపోతే ఎలా తెలుస్తుందనుకున్నావు మరి? నిన్న నేను బందరు వెళదామని బైలుదేరుతుండగా టెలిగ్రాం వచ్చింది. నేను బందరు బదులు యిటు వచ్చాను. ఆ టెలిగ్రాం ఒక్క అరగంట ఆలస్యం అయివుంటే నీ సుందర స్వప్నం నిజమైవుండేది. కనీసం నా

విషయంలో!''

నాన్నగారి మీద నాకు చెప్పలేనంత కోపం వచ్చింది.

కృష్ణకి టెలిగ్రాం యిస్తున్నట్టు నాతో మాటమాత్రంగానైనా చెప్పలేదు.

ఇద్దరం బైటకి వచ్చేసాం.

కృష్ణ జట్కా మాట్లాడాడు.

అతను 'సత్యన్నారాయణపురం'లోని ఏదో వీధి పేరు చెప్పటం వినగానే, "అదేమిటి? మనం బస్ స్టాండ్‌కి కాదా వెళ్ళేది?'' అన్నాను.

"కాదు. నాకు బజారులో పనుంది. అది పూర్తి చేసుకుని సాయంత్రం బస్‌కి వెళదాం.'' అన్నాడు.

ఇద్దరం యెక్కాం.

జట్కా కదిలింది.

గుఱ్ఱానికి కళ్లెం వున్నా పంచ కళ్యాణిలా పరుగెత్తుతున్నట్లు అనిపించింది నాకు.

బండీ అతను 'తప్పుకోండి. జర గండి' అని అరుస్తూనే కఱ్ఱ చక్రంలో పెట్టి 'టక టక టక' శబ్దం చేయ సాగాడు.

ఆ వీధులు, ఆ జనాల్ని పరిశీలనగా చూస్తున్నట్టు కూర్చున్న నేను మధ్యలో కృష్ణవైపు చూసాను.

అతను అదే సమయంలో ఎందుకో నా వైపు చూసాడు.

ఇద్దరి పెదవులమీద చిరునవ్వు కదిలింది!

ఇద్దరి ముఖాల్లో ఒకే విధమైన ఆనందం!

ప్రాణమిత్రులో, ఆత్మీయులైన యిద్దరు వ్యక్తులో చాలాకాలం తర్వాత కలుసుకున్నప్పుడు కలిగే భావంలా వుంది.

అతన్ని చూస్తున్నట్టు హఠాత్తుగా పట్టుబడ్డ నేను అది కప్పి పుచ్చుకోటానికి అన్నట్టుగా అడిగాను.

"మనం యిప్పుడు వెళ్ళేది యెవ రింటికి?''

"నాకు పిన్ని వరస అవుతుంది. వాళ్ళింటికి.''

కృష్ణ అంటుండగానే జట్కా ఒక యింటిముందుకు వచ్చి ఆగింది.

కృష్ణ దిగి తలుపు తడుతూ 'పిన్నీ' అని పిలిచాడు.

లోపలనుంచి మనిషి వస్తున్నట్టు అలికిడిగాని, వస్తున్నా అన్న శబ్దంగానీ ఏదీ వినిపించలేదు.

"ఎవరూ లేనట్టున్నారు.'' అన్నాను.

"వుంది. పూజ చేసుకుంటోందేమో!'' అన్నాడు.

జట్కా అతను పెట్టెతెచ్చి మాదగ్గర పెట్టాడు.

కృష్ణ జేబులోనుంచి పర్స్ తీశాడు.

"ఉండు. నా దగ్గరుంది నేనిస్తాను.'' అన్నాను.

కానీ నేను బాగ్ తెరిచి డబ్బు తీసే లోపలే కృష్ణ అతనికి యివ్వటం, అతను వెళ్ళిపోవటం కూడా జరిగింది.

"నీకు నేను ఎలాగూ కూలీ యివ్వాలిగా?"

"యిద్దుగాని తొందరపడకు. వడ్డీతో సహా వసూలు చేస్తాను."

ఇంతలో తలుపులు తెరుచుకున్నాయి.

తలుపు ఒక రెక్క మాత్రమే తెరిచి, ఓ పక్కగా తొలిగి నిలబడింది ఆవిడ.

"రా!" కృష్ణ నన్ను పిలిచి సూట్ కేసు తీసికొని లోపలకు వెళ్ళాడు. నేను కూడా లోపలకు అడుగు పెట్టాను.

కృష్ణ పిన్ని అని చెప్పిన ఆవిడ వయసు 80 కి పైగా వుంటుంది.

ఒళ్ళంతా ముడతలు పడిపోయింది.

రెండు గజాలకంటే ఎక్కువ లేని తడిబట్ట ఒంటికి చుట్టుకున్నట్టుగా కట్టుకుంది.

ముఖాన విభూది వుంది.

మెడలో రుద్రాక్షమాల లున్నాయి.

తల నున్నగా వుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే కాషాయ వస్త్రం కట్టుకోని బౌద్ధసన్యాసిలా వుంది.

ఆవిడ పూజలోనుంచి లేచి వచ్చింది కాబోలు.

నోటినుంచి శబ్దంరాకుండా మంత్రాలు యింకా వుచ్చరిస్తూనే వుంది.

కృష్ణ నా గురించి చెప్పగానే నోటితో మాట్లాడలేదు. కానీ పలకరింపుగా చూసి, అక్కడున్న మంచం చూపించి కూర్చోమన్నట్టు సౌంజ్ఞచేసి వెళ్ళిపోయింది.

కృష్ణ ఆవిడ వెంటే లోపలకు వెళ్ళాడు.

"పిన్నీ! ఫ్లాస్క్ యిలా యివ్వు." అనటం వినిపించింది.

నేను మంచంమీద కూర్చున్నాను.

కృష్ణ తిరిగి వచ్చాడు. కానీ అతని చేతిలో ఫ్లాస్క్ లేదు.

"నువ్వు బజారు వెడుతున్నావా?" అన్నాను.

"అవును. ఏం? నీకేమైనా కావాలా?"

"వద్దు. నేను డబ్బు యిస్తాను."

"డబ్బా! దేనికి?"

"కాఫీ తెస్తానంటున్నావుగా?"

"డబ్బు డబ్బు అంటున్నావు. ఎంత తెచ్చావేమిటి? ఏదీ చూడనీ?" అంటూ మంచంమీద నా పక్కన పెట్టివున్న బాగ్ చేతిలోకి తీసుకున్నాడు.

నేను చటుక్కున అతని చేతులు గట్టిగా పట్టుకున్నాను.

"వద్దు వద్దు. తెరవకు." గట్టిగా అనేసాను.

కృష్ణ బాగ్ వదిలేశాడు.

నేను దాన్ని దగ్గరికి తీసుకున్నాను.

"ఏమిటా ఖంగారు? ఏముంది అందులో?"

"నా ప్రాణం!" మురిపెంగా చూసాను.

"ఓహో! అయితే అది నా దగ్గర వుండటమే మంచిది. యిటివ్వు. జాగ్రత్తగా చూస్తాను." మళ్ళీ తీసుకోపోతున్నట్టు నటిస్తూ అన్నాడు.

నేను బాగ్ దూరంగా పెట్టాను.

"ఆగాగు. తొందరపడకు. నీకే యిస్తాలే. యిప్పుడు కాదు. సమయం సందర్భం కుదరనీ మరి."

కృష్ణ విస్మయంగా చూశాడు.

"ఏం మాట్లాడుతున్నావు నువ్వు?" అర్థంగానట్టు చూస్తూ అన్నాడు.

"లాటిన్! నీ కర్థంగాదు. సరేనా? వెళ్ళు." నాలిక బైటపెట్టి వెక్కిరిస్తూ అన్నాను.

క్షణంసేపు నావైపు తదేకంగా చూసిన కృష్ణ వెళ్ళిపోయాడు.

ఐదు నిమిషాల అనంతరం నేను లేచి పెట్టె తీసి బాగ్‌లో వున్న కాగితాలు అందులో చీరల అడుగున భద్రపరిచాను.

ఇంతలో పిన్నిగారు వచ్చింది.

ఆవిడ పూజ అయిపోయినట్టుంది.

తెల్లటి గ్లాస్కో పంచె కట్టుకుంది.

"ప్రయాణం బాగా జరిగిందామ్మా. స్నానం చేస్తావేమో చెయ్యి." అంది.

నిద్రలేమితో, ప్రయాణపు బడలికతో, చిరాకుగా, విసుగ్గా వున్న నాకు తలమీద స్నానం చేస్తేగాని హాయిగా వుండదు అనిపించింది. పెట్టెలోనుంచి బట్టలతో పాటు, షాంపూ సీసా తీసుకుని బాత్ రూమ్‌లోకి వెళ్లాను.

దాదాపు అరగంట తర్వాత తడి జుట్టు తుడుచుకుంటూ బైటికి వచ్చిన నావంక బామ్మగారు ఆశ్చర్యంగా చూపింది.

"అదేమిటే అమ్మాయి! తలంటిపోసుకుంటానంటే కుంకుడుకాయలు కొట్టియిచ్చేదాన్నిగా! సబ్బుతో రుద్దుకున్నావా?"

"నా కలవాటేనండీ" అన్నాను చిక్కు తీసుకుంటూ.

ఇంతలో కృష్ణ వచ్చాడు.

బామ్మగారు మా యిద్దరికి టిఫిన్ పెట్టి కాఫీ యిచ్చింది.

కాఫీ తాగుతుండగా కృష్ణ అన్నాడు.

"నేను బజారులో పని చూసుకు వస్తాను. నువ్వు రాత్రంతా నిద్ర లేదన్నావుగా పడుకో!" అన్నాడు.

"నేనా! అలా వేళగాని వేళలో నిద్రపోయే అలవాటు నాకు లేదు. నువ్వు బజారుకు వెళితే యిక్కడ నేను ఒక్కదాన్ని ఏం చెయ్యాలి?"

"గోళ్ళు కొరుకు." నవ్వుతూ అన్నాడు.

"ఉహుం. లేవు. ఏం తోచకపోతే నాకు మనుష్యుల్ని కొరికే ప్రమాదం వుంది. జాగ్రత్త!" అన్నాను బెదిరిస్తున్నట్టుగా.

"చచ్చాంపో! అయితే బైలుదేరు నాతో." నిజంగానే బెదిరిపోయినట్టు చూస్తూ అన్నాడు.

ఇద్దరం బైలుదేరాం.

కృష్ణ యేవేవో కొన్నాడు.

అందులో ఎక్కువగా బట్టలే ఉన్నాయి.

ఒక్కొక్కరకం బట్టలకి ఒక్కొక్క షాపు తిరిగాం.

రాజుకి ఖరీదు గలవి రెండు మంచి

పట్టుచీరలు కొన్నాడు.

అత్తయ్యకీ, పిల్లలకి పెళ్ళివారికి పెట్టాల్సిన బట్టలు రకరకాల ఖరీదుల్లో కొన్నాడు.

బట్టల రంగులు, డిజైన్లు, వాటి నాణ్యం పరిశీలన యిది చూడటంలో అతనికున్న అభిరుచికి నేను అబ్బుర పడ్డాను.

నాకు తెలిసినంతవరకూ మా అమ్మ తప్ప యింకెవరికీ యిలాంటి సామర్థ్యం లేదు.

నేను వూరికే అతని వెంట వుండేదాన్ని. అన్నీ అతనే చూసుకున్నాడు. మధ్యమధ్యలో 'యిదెలా వుంది' అంటూ నన్ను సంప్రదించినట్టు అడిగేవాడు.

"బాగుంది."

"నేను చెప్పిన ప్రతిదీ బాగుంది అంటావేం?"

"బాగున్నప్పుడు కాదనాలా?"

ఇలా సాగిపోయేది మా సంభాషణ.

పాకెట్లు అన్నీ కలిపి చాలా అవటంతో నేను కొన్ని పట్టుకున్నాను. టైమ్ జర జర పాకిపోయినట్టు చూస్తూండగానే రెండయింది.

"పదపద. చాలా ఆలస్యం అయిపోయింది. నేను చూడనేలేదు" అన్నాడు కృష్ణ.

ఇంటికి తిరిగి వస్తుండగా అన్నాను.

"ప్చ్! ఈ వూరుమీదుగా నేను ప్రయాణం చేయటం యిది మూడోసారి. ఒక్కసారి కూడా ఆగలేదు. నాన్నగారు యెప్పుడూ చెబుతుంటారు. దుర్గ గుడి చాలా బాగుంటుందని. చూడటం పడనే లేదు." అన్నాను.

కృష్ణ నా మాట విన్నాడో లేదో! లేక విని వూరుకున్నాడో! ఎలాంటి వ్యాఖ్యానం చేయకుండా వూరుకున్నాడు.

ఇంట్లో గుమ్మం దగ్గర కాలు పెడుతుండగా రుసరుస లాడుతున్నట్టుగా అన్నాను.

"మంచివాడివే! నేను కాస్త అలా వూరు చూసినట్టు వుంటుందని వస్తే నీ లగేజ్ అంతా నా చేత మోయించావు. చాలా తెలివిగలవాడివి! పొద్దున నా పెట్టె పట్టుకున్నందుకు ప్రతిఫలంగా యివన్నీ నా చేత పట్టించుకొచ్చావు. అవునా?"

కృష్ణ నావైపు తిరిగాడు.

అతని కళ్ళు చురుగ్గా నా ముఖంలో భావం చదవటానికి ప్రయత్నించినాయి. నేను సీరియస్‌గా చూడబోయి ఫక్కున నవ్వాను.

"అదృష్టవంతురాలివి," అన్నాడు చిరునవ్వుతో తలుపు తట్టుతూ.

"ఎందుకూ? నీ వెంట పెట్టెలు మోసుకొచ్చినందుకా?"

"కాదు. అంత హాయిగా నవ్వగలుగుతున్నందుకు. ఏ చీకూ, చింతా లేనివాళ్ళే అంత స్వచ్ఛంగా, నిష్కపటంగా నవ్వగలుగుతారు."

పిన్నిగారు తలుపు తెరవడంతో మా

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

సంభాషణ ఆగిపోయింది.

"ఇంతసేపు చేసారేమర్రా? తిండి తిప్పలమాట మర్చిపోయారా? చేసినవన్నీ చల్లారిపోయినాయి. రండి. రండి." అంది ఆవిడ.

నిజమే! నాకు ఆకలిమాట మర్చిపోయి నట్టుగానే వుంది. పిన్నిగారు మా ఇద్దరికీ పక్క పక్కన పీటలు వేసి వెండి కంచాలు పెట్టి భోజనం వడ్డించింది.

ఇద్దరం కూర్చున్నాం.

పిన్నిగారికి మా నాన్న తెలుసుట! చిన్నప్పుడు చూసిందిట!

అప్పటి విషయా లేవో చెబుతూ వడ్డిస్తోంది.

అన్నం తింటుండగా నాకు పల మారింది.

కృష్ణ నా నెత్తిమీద తట్టబోయి ఆగి, "తలమీద కొట్టుకో." అన్నాడు.

"పాపం! వాళ్ళమ్మా, నాన్నా తలుచు కుంటున్నారు కాబోలు." అంది పిన్ని గారు.

"ఉహూ! కాదులే పిన్నీ! తలుచుకునే వాళ్ళు వేరే వున్నారు."

కృష్ణ నా వైపు కొంటెగా చూసి నవ్వాడు.

నా కెందుకో నవ్వు రాలేదు.

నేను చాలా సంతోషంగా వున్నానను కుంటున్న యీ సమయంలో సారధిని జ్ఞాపకం తెచ్చినందుకు రవంత కోపం కూడా వచ్చింది.

పిన్నిగారు నేతిగిన్నెకోసం అటువైపు తిరిగింది.

నేను చేయి జాచి కృష్ణ చేతిమీద గట్టిగా గిల్లాను.

"అబ్బా!" కెవ్వు మన్నట్టుగా అన్నాడు.

"ఏమిటిరా?" ఆవిడ కంగారుగా వెనక్కు తిరిగింది.

కృష్ణ తల గోక్కుంటూ "ఏం లేదు పిన్నీ! నాలిక కొరుక్కున్నాను." అన్నాడు.

"అవునవును! ఎవరైనా తిట్టుకుం టున్నారేమో! నువ్వు నాతో కూర్చుని యిలా సరదాగా కబుర్లు చెబుతున్నావని వాళ్ళకి తెలిసిందేమో!" అన్నాను.

"వాడిని తిట్టేవాళ్ళు ఎవరే అమ్మా! వాడిని తిడితే కళ్ళు పోతాయి. ధరమ రాజు."

కృష్ణ వంక ఆప్యాయంగా చూస్తూ అంది.

"అయినా మా మయ్య కూతురివి. నీతో కాకపోతే యింకెవరితో సరసం ఆడతాడు?" అంది మళ్ళీ.

హఠాత్తుగా కృష్ణ ముఖం ఎందుకో సీరియస్‌గా అయిపోయింది!

(సశేషం)

Published by D.H. Rao, at No.1 Arcot Road, Madras-26.
Printed by him at Kranti Press,
12, Francis Joseph Street, Madras-1
Controling Editor : Sri "CHAKRAPANI"



∘ స్వాభిమానం - దౌర్బల్యం ∘